# జిల్లెళ్ళమూడి అమ్మ

## సినిమా వ్యాఖ్యానము



....: రచన :....

కొండముది రామకృష్ణ

# జిల్లెళ్ళమూడి అమ్మ

## సినిమా వ్యాఖ్యానము

ర చ న :

కొండముది రామకృష్ణ

Rs 4 - 00

# సంతోషదాయకం

జగన్మాత పవిత్ర పాద మంజీరమే మన రామకృష్ణ అన్నయ్య. ఆ రమణీయ క్వణత్ కింకిణీ నిస్వనమే మహోదధిలో తరంగాలు, అమ్మ-సినిమా వ్యాఖ్యానము. అనంత శక్తిస్వరూపిణి, సర్వజ్ఞ అయిన అమ్మను సహస్ర కోణాల అధ్యయనం చేసి, స్వానుభవ సంజనితమైన దృఢ విశ్వాసాల్ని, అమ్మ యొక్క మానవతా మాధవత్వ మధుర సమ్మేళనాన్ని, అనన్య సాధ్యమూ అపూర్వమూ అయిన అమ్మ సాన్నిధ్య మహిమను వేనోళ్ళ వివరించాడు, వెల్లడించాడు. ఆ అలౌకిక అనుభవాన్ని అక్షరబద్ధంచేసి, అమ్మ తత్వానికి దర్పణం పట్టి, వెండి తెరపై చూసిన కమనీయ దృశ్యాన్ని చెరిపోని, చెరిగిపోని విధంగా శాశ్వతంగా మన మనోఫలకాలపై ప్రతిఫలింప చేసిన అన్నయ్యకు అఖిల సోదర సోదరీ పక్షాన మా కృతజ్ఞతాభినందనలు.

........అమ్మ యొక్క ఈ అవతారంలో ఎక్కడా కాఠిన్యంకనిపించదు, శాసనంవినిపించదు అంతాలాలిత్యమే అందరిపై వాత్సల్యమే. అందరిపై కారుణ్యమే. శరీరం మందారంకన్నా మార్దవం. మనస్సు వెన్నకన్న మెత్తన; వెన్నెలకంటె చల్లన. ఈ అకారణ కారుణ్యం,
అనంత వాత్సల్యం,
సర్వతోనురాగం అమ్మకు
మాత్రమే సాధ్యం........ అని వర్ణించ గలిగిన ద్రష్ట మన అన్నయ్య. కనుకనే అనురాగమూర్తి అయిన అమ్మను
స్వరూప లలిత
స్వభావ మధుర
ప్రేమ రూపిణి
ప్రేమ భాషిణి
ప్రేమ వర్షిణి ...... అని వర్ణించి, తీవ్ర భక్త్యావేశంతో వివశుడై "ప్రేమోన్మాదిని" అంటేనేగాని తనివి తీరలేదు. కనుకనే.... అమ్మను గురించి ఎంత చెప్పినా, అది పూర్తిగా చెప్పినట్లు కాదు. ఎప్పుడూ చెప్పినదానికంటె చెప్పవలసింది అమితంగా ఉంటూనే ఉంటుంది.... అనే తన నిశ్చితాభిప్రాయాన్ని వెల్లడించాడు.

........ అమ్మ జీవితమే ఒక మహోత్తమ సందేశం,
అమ్మ ప్రతి చర్య మహత్తర ఆదర్శం,
అమ్మ ప్రతిమాట మహోదాత్త సూక్తి........

అన్నాడు. మాతృశ్రీ స్వర్ణోత్సవాలలో లక్షమందికి పైన ఒక్క పంక్తిని కూర్చుని భోజనం చేసిన అత్యద్భుత సన్నివేశం-మానవాతీతమైన మహత్కార్యం అని, అమ్మ అనంతశక్తికి ప్రత్యక్షనిదర్శనం అని పేర్కొన్నాడు.

అట్టలపై అమ్మ నామాలనే కాదు
అంతరంగాల్లో నమోవాకాల్ని,
దండలు వేసే వాళ్ళనే కాదు
దండాలు పెట్టే వాళ్ళనీ చూపించాడు.

........ ఆశలను ఫలింపచేసే వసంతమూ అమ్మే
ఆశల ఆకులను రాల్చివేసే హేమంతమూ అమ్మే .......

........ అని సర్వద్వంద్వాలూ తానే అయిన అమ్మను సకల ప్రకృతి స్వరూపిణిగా గుర్తించమన్నాడు.

........ అమ్మ ఉయ్యాల ఊగుతుంది.
అమ్మను ఈ జగత్తే తూగుటుయ్యాల
కష్టసుఖాలు కలిసిన జీవితమే రసహేల........

........ అని అమ్మ విరాట్స్వరూప సందర్శనం చేయించాడు.

........ తల్లి అంటే తరింప చేసేది,
కేశఖండన కాదు, క్లేశఖండన.... అని అమ్మ ఇచ్చిన నిర్వచనాలను గుర్తుచేసి అమ్మను ఆపదుద్ధారిణిగను,
సకల జీవకోటికి ఏకైక అస్త్రరాలు గను గుర్తించమన్నాడు.

........ అదిగో, గంట కొడుతున్నారు. ఇక కొద్దిక్షణాల్లో అమ్మ దర్శనం అవుతుంది. ఎవరి అనుమతీ అవసరం లేదు....

........ అని సర్వులకూ స్వతంత్రమైన అందరింటి స్వరూపాన్ని స్వభావాన్ని స్పష్టంచేశాడు.

........ అన్నం పెట్టినట్లు అందరికీ పెట్టక పోయినా ఎందరో బిడ్డలకు గుడ్డలు కూడా పెట్టి అమ్మ ఆశీర్వదిస్తోంది. పెళ్ళిచేసుకువచ్చిన క్రొత్త దంపతులకూ పెడుతుంది, అప్పులను కోల్పోయి గంపెడు

దుఃఖంలో వచ్చినవారికీ పెడుతుంది........ అంటూ ఆయా సం దర్భాలను పురస్కరించుకొని పెట్టుకోవటమే తల్లి ధర్మమని వివరించాడు.

........ పరాశక్తి, పరమేశ్వరి, పరాంబిక మానవరూపంలో మన మధ్య తిరుగుతున్నది.

కానీ ఆమె దేవత అని తెలుసుకున్న తర్వాత ఆ విశ్వ సమ్మోహనమూర్తిని కనులారా చూసే పరమ భాగ్యాన్ని ఎవరు వదులుకుంటారు?

ఆ పావన పాదాలను తాకే అదృష్టాన్ని ఎవరు జారవిడుచుకుంటారు?........ అని ప్రశ్నించాడు.

........ దైవం తానే, భక్తుడు తానే
పూజ తానే, పూలు తానే

సర్వం తానైన తల్లి ... అని కర్తృత్వం నిజానికి మన తలపై లేదనే నిగూఢ రహస్యాన్ని వెలికి తీసి సమాధాన పరిచాడు.

........ అమ్మ శమీచీట్లను పంచుతున్నది. తాముచేసిన పుణ్యాలకైనా, పాపాలకైనా తమకేమీ బాధ్యత లేదని అమ్మ ఘంటాపథంగా చెబుతున్నది. అయినా తాము చేసిన పాపాలన్నిటినీ క్షమించవలసిందిగా అందరూ అమ్మను వేడుకుంటున్నారు .. అంటూ మేరుసమానధీర, పాపారణ్యదవానల అయిన అమ్మ అనల్పత్వం ముందు మన అల్పత్వాన్ని చాటి "మాతర్భవాని మమదేహి కరావలంబం" అనటంలో తియ్యదనాన్ని రుచిచూపించాడు.

........ అమ్మకు పారిపంచికమనీ, పారమార్థికమనీ రెండు లేవు. ఎవరేం చేసినా అంతా దైవారాధనే అంటుంది అద్వైతమూర్తి అమ్మ
........ అంటూ అమ్మ బోధలు అర్థం చేసుకున్న వారికి "కాలం కాలనాగు కాదు,

కర్పూర నీరాజనం" - అని అన్నాడు. వారికి బ్రతుకు శాపం కాదు, కాలం సర్పసదృశం కాదు.

దివ్యప్రభలను వెదజల్లుతూ, సుగంధ పరిమళాన్ని విరజిమ్మే కర్పూర కళిక లాగ వెలిగి మహాచైతన్యంలో విలీనమౌతారు అని సూచించాడు.

ఇంకా....అమ్మ సన్నిధిలో నిత్య కార్యక్రమం,

అమ్మ సన్నిధి మాహాత్మ్యం,

అమ్మ ప్రసాదం, అన్నపూర్ణాలయం, హైమాలయం,

అమ్మ వడి - మమతల గర్భ గుడి,

అమ్మ ఆశీర్వచనం,

అమ్మ పాదసన్నిధిలో శ్రీరామనవమి, వైకుంఠ ఏకాదశి, నవరాత్రి, దసరాలలో పూజలు;

అమ్మ ప్రసాదించిన అందరింటిలో భోగి, దీపావళి, నూతన సంవత్సరాది పండుగలు,

అమ్మ చేత నామకరణ, అన్నప్రాశన, అక్షరాభ్యాసం,

అమ్మ సన్నిధిలో అమ్మ అమృత హస్తాలమీదుగా ఉపనయనం, వివాహం,

అమ్మ దృష్టిలో వివిధ ఆశ్రమాలకు గల స్థానం,

అమ్మ చే ప్రారంభించబడిన విద్యాలయం, వైద్యాలయం, శ్రీ విశ్వజననీ పరిషత్;

అమ్మ అనుమతితో ప్రారంభించబడిన మాతృశ్రీ అధ్యయన పరిషత్తులు,

అమ్మ వాత్సల్య యాత్ర

అమ్మ సందేశం ....ఎన్నో విశేషాంశాల్ని,

మాటలకు అందనిభావాల్ని అన్నయ్య మంచిమనస్సుతో చెప్పాడు

అమ్మ సన్నిధిలోని అనిర్వచనీయమైన అనుభవాలకి అక్షరబద్ధమైన రూపకల్పనే ఈ సినిమా వ్యాఖ్యానం.

సర్వులకూ ఉపయోగకరమైన, ఆసక్తికరమైన ఈ సినిమా వ్యాఖ్యానాన్ని అమ్మ ఆశీస్సులతో ది 23-4-83 తేదీ రుధిరోద్గారి చైత్రశుద్ధ ఏకాదశినాడు అమ్మ వజ్రోత్సవాల సందర్భంగా పుస్తకరూపంలో ప్రచురించి, సోదర లోకానికి అందించే మహాభాగ్యం మాతృశ్రీ అధ్యయన పరిషత్, నరసాపురం సోదరులకు కలగటం గర్వకారణం, ఎంతో సంతోషదాయకం.

మాతృశ్రీ అధ్యయన పరిషత్, నరసాపురం

దుందుభినామసం॥ర మహాశివరాత్రి

ఇట్లు

మీ తోడబుట్టిన

డా॥ ఆచంట కేశవరావు

ఆధ్యాత్మిక చింతను, సామ్యవాదాన్ని ప్రప్రథమంగా ప్రవేశ పెట్టిన మహా ప్రవక్త అమ్మ. ప్రేమ సందేశాన్ని, విప్లవాత్మక సిద్ధాంతాలనూ అశేష సోదర ప్రజానీకానికి చిత్రరూపంగా అందించవలెననే మా పవిత్ర ఆశయాన్ని మన్నించిన అనురాగమూర్తి అమ్మకు మా సాష్టాంగ ప్రణామాలు.

ఈ మహత్తర కార్యక్రమంలో అన్నివిధాలా మాకు సహాయ సహకారములు నందించిన విశ్వజననీ పరిషత్, జిల్లెళ్ళమూడి వారికి, మాతృశ్రీ అధ్యయన పరిషత్తు గుంటూరు, నెల్లూరు, ఏలూరు, నర్సాపురం, పాలకొల్లు, రాజోలు వారికి, Amma Humanitarian Mission Hyderabad వారికి, కీ. శే. పామర్తికి మా హృదయపూర్వక ధన్యవాదాలు.

నేను నేనైన నేను
అన్ని నేనులు నేనైన నేను.

యయాశక్త్యా బ్రహ్మ కమలనయనః పాలనయనః
జగత్సృష్టుం పాతుల ప్రళయము పనేతుంచ కుశలాః
యయా వ్యాప్తం విశ్వం వసతి ఖలు యస్యాం జగదిదం
నమామ్యాద్యాం దేవీం ముకుళితకరస్తామ భయదాత్ మ్॥

....... జిల్లెళ్ళమూడి అమ్మ వర్ణ చిత్రం ... ....

వ్యాఖ్యానము : కొండముది రామకృష్ణ
పాటలు : డా॥ పన్నాల రాధాకృష్ణశర్మ,
డా॥ శంకర శ్రీ రామారావు,
డా॥ ప్రసాదరాయ కులపతి,
బి. యల్. ఎన్ ఆచార్య, నదీరా
మన్నవ బుచ్చిరాజు శర్మ
సంగీతం : సుసర్ల దక్షిణామూర్తి; కీ. శే. పామర్తి.
నేపథ్యగానం : మంగళంపల్లి బాలమురళీకృష్ణ, S. P. బాలసుబ్రహ్మణ్యం, కీ. శే. ఘంటసాల, P. సుశీల, S. జానకి, P. లీల, రామకృష్ణ, అవధూతేంద్ర సరస్వతీ స్వామీజీ.

కూర్పు; దర్శకత్వం: M. S. N. మూర్తి, S. I. F. E. A.
ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్: K. B. G. కృష్ణమూర్తి
పాట :-

జిల్లెళ్ళమూడిలో స్త్రీరూపధారిణియై
దిగివచ్చి నిలిచినది దివ్యమాతృప్రేమ ॥జిల్లెళ్ళ॥
ఆ ప్రేమధారలో ఆత్మార్పణము చేసి,
తనియించెదరు దేహధారు లీ వసుధలో ॥జిల్లెళ్ళ॥
కనుదోయి వర్షించు, కరుణామృతము గ్రోలి
తమ్మ తా మరతురు, తత్సన్నిధానమున ॥జిల్లెళ్ళ॥
తన బిడ్డలట లోకమున కల్గు జనులెల్ల
తన ప్రేమ దుగ్ధముల తనియించి బ్రోతురట ॥జిల్లెళ్ళ॥
ఎవ్వరో ఈ అమ్మ ఎందుకో ఈరాక
ఏతీరములనుండి ఏమి కొని తెచ్చెనో
అమ్మ అమ్మలకమ్మ మేలి బంగరు బొమ్మ
అమ్మ పదముల కివే ప్రేమ ప్రసూనాలు
అమ్మ పదముల కివే ప్రేమ ప్రసూనాలు ॥జిల్లెళ్ళ॥

—డా॥ శంకర శ్రీరామారావు

బాపట్ల రైల్వేస్టేషన్ :

అది విజయవాడ - మద్రాసుల మధ్య ఉంది. విశ్వజననిగా సర్వ జనారాధ్య అయిన అవతారమూర్తి అమ్మకు నివాస స్థలమై, ఆపావన పాద పంకేరుహ పరాగ పరిమళ పరివృతమై ప్రసీతమై, పుణ్యక్షేత్రమై, పవిత్ర తీర్థస్థలమై యాత్రాకేంద్రమైన జిల్లెళ్ళమూడి వెళ్ళటానికి యిక్కడనే రైలు దిగాలి.

మాతృశ్రీ ప్రింటర్స్ : అమ్మను గురించిన సాహిత్యము యిక్కడనే ప్రచురింపబడుతున్నది. వాగమృతవాహినియై ప్రవహించే అమ్మ అనంతజ్ఞాన సంపదను, గ్రంథరూపంలో భావితరాలవారికై భద్రపరుస్తున్న పవిత్రాలయమిదే. అమ్మ జీవితచరిత్ర అద్భుతమైనదే కాదు, అమృతోపమానమూ, ఆనందరస పరిపూర్ణమూ. అమ్మ నిత్యమూ ప్రవచిస్తున్న సూక్తులూ, సూత్రాలూ విలక్షణమైనవే కాదు, విశిష్టమై

నవికూడా. మాటల ద్వారానూ, చేతల ద్వారానూ అమ్మ ప్రసారం చేస్తున్న సిద్ధాంతాలూ సందేశాలూ విప్లవాత్మకమైనవే కాదు, అన్ని మతాలు అంగీకరించేవే.

అమ్మ బోధలు నిరాశా జీవులకు నవరాగ మాలికలు.
తప్త హృదయాలకు శరత్ చంద్రికలు.
సుప్త మానవాళికి ప్రభాత గీతికలు.
పథ విహీనులకు మార్గ దర్శకాలు.

నేటి సంకుల సమాజానికి క్రొత్తపాఠాలు - అవి.... నేడు జిజ్ఞాసువుల మనస్సులకు పదను పెడుతున్నాయి. మేధావుల ఆలోచనా రీతులను క్రొత్తదారుల నడుపుతున్నాయి-

అవి నిసర్గ సుందరాలు - సత్య సంశోభితాలు
సర్వ మాంగళ్య ప్రదాలు. అందుకనే అవన్నీ ఎప్పటి కప్పుడు వ్రాయబడి, జాగ్రత్త పరచబడి మాస పత్రికల ద్వారానూ, గ్రంథాల రూపంగానూ అందించబడుతున్నాయి.

పాట -: ఏమి వర్ణింతువోయి నీవు కవిరాజా
ఈ అనిర్వచనీయ హృదయగాధ
ఏమి పాడెదవు నీవో మహాగాయకా
యీ జీవకోటిలో నెదుగు బాధ
ఏమి చెక్కెదవు నీవో మహత్తర శిల్పి
ఊహల కందని మహోదయంబు
ఏమి చిత్రింతువోయి చిత్రకారుడా
అంతరం భోధుల అలల ఘోష
ఎప్పుడైనను నీవు స్పర్శించినావే
అర్కపురిలోని అమ్మ పాదాంబుజములు
నేడు కాంతువు నీజన్మ నెగుడు ఫలము
నడచిరావోయి, నడచిరావోయి, నిండు మనసు తోడ.

—డా॥ ప్రసాదరాయ కులపతి.

సమాచార కేంద్రము (Enquiry Office) : రోజూ వచ్చే వందలాది యాత్రికులను ఆదరంగా ఆహ్వానించి వారికి కావలసిన సౌకర్యాలను ఏర్పాట్లను గురించి తెలియజేయటంకోసం ఏర్పడింది. ముందుగా యాత్రికుల గురించి వారిపేరూ, ఊరూ వగైరా కనుక్కొని వ్రాసుకుంటారు. వారు యీ స్థలానికి లోగడనే పరిచయస్తులైతే సరే. లేకపోతే స్థూలంగా యిక్కడి విశేషాలను గురించి వివరిస్తారు. అమ్మను చూడటానికి వ్యవధి ఉంటే ఆసమయంలో ఎవరో ఒకరు వెంటబెట్టుకొని తీసుకువెళ్ళి ఆవరణలోని అన్ని విశేషాలను చూపించి ఏశాఖ ఎందుకు ఏర్పడిందీ, ఎట్లా పనిచేస్తుందీ తెలియచేస్తారు.

అమ్మను గురించి ఎంత చెప్పినా అది పూర్తిగా చెప్పినట్లుకాదు. ఎప్పుడూ చెప్పిన దానికంటే చెప్పవలసింది అమితంగా ఉంటూనే ఉంటుంది. మరి అమ్మ అంటే ఆదీ అంతం లేందికదా! ఇక్కడ నిత్యకార్యక్రమం సుప్రభాతంతో ప్రారంభమౌతుంది.

ఉత్తిష్ఠోత్తిష్ఠ హే మాతః ఉత్తిష్ఠ జగదీశ్వరి
ఉత్తిష్ఠ సదయాపాంగే - సర్వలోక శుభం కురు
అమ్మా - అనసూయమ్మా -
అఖిల లోకేశ్వరీ - రాజరాజేశ్వరీ మేలుకో ॥అమ్మా॥
తొలి సంజ తొయ్యలి తొగరు మేలి ముసుగు
ధరియించి ఎదురయ్యె మేలుకో
కలకలమ్ముల పక్షి గణములన్నియు నీకు
పలికె సుస్వాగతము మేలుకో ॥అమ్మా॥
అమ్మా - నాన్నా - యంచు అనుగు బిడ్డలనెల్ల
ఆహ్వానింపవలె మేలుకో
కమ్మని మాటల కండ చక్కెర రసము
రుచిచూపవలె నింక మేలుకో ॥అమ్మా॥
ముక్కోటి దేవతలక్కజముగ నింగి
గుమిగూడిరోయమ్మ మేలుకో
చక్కని నీ రూపు నొక్కసారి గాంచి
చొక్కగ నున్నారు మేలుకో ॥అమ్మా॥

—డా॥ పన్నాల రాధాకృష్ణ శర్మ

## ........ శ్రీ విశ్వజననీ పరిషత్ కార్యాలయం ........

**మాతృశ్రీ పబ్లికేషన్స్ ట్రస్టువారి విక్రయశాల :**

అమ్మను గురించిన పత్రికలూ, పుస్తకాలూ యిక్కడ విక్రయింపబడతాయి. ఇక్కడనే అమ్మ ఫోటోలు కూడా దొరుకుతాయి. పలు సందర్భాల్లోనూ వేరు వేరు పండుగల్లోనూదర్శనమిచ్చే అమ్మ రమణీయ రూపాలకు ప్రతిబింబాలే యీ ఫోటోలు. దూరాన ఉండి కూడా అమ్మను అర్చించుకునే వారికి యీచిత్రాలు వరప్రసాదాలు. అమ్మ అద్భుత జీవితచరిత్రలోని ముఖ్య సంఘటనలే "మహోదధిలోని తరంగాలు" అప్పుడప్పుడు సంభాషణల్లో అమ్మ నోటి నుండి వెలువడిన ఆణిముత్యాలే........ "అమ్మవాక్యాలు". ఇంకా అనేక పుస్తకాలు. తెలుగులో ఇంగ్లీషులో ప్రతినెలా మాసపత్రికలు వెలువడుతున్నాయి అమ్మ జీవితచరిత్ర, అమ్మ యితరులతో చేసిన సంభాషణలూ, అమ్మ యిచ్చినకొత్త నిర్వచనాలూ అందులో ఉంటాయి. అమ్మవద్ద యితరులుపొందిన దివ్యానుభవాలూ, అమ్మకరుణవల్లకలిగే ఉపయోగాలూ అమ్మ మహిమలు ఇంకా ఎన్నో వాటిద్వారా తెలుసుకోవచ్చు. ఆవరణలో పోస్టాఫీసూ, పబ్లిక్ కాల్ ఆఫీసు ఉన్నాయి.

**హోమియో వైద్యశాల :** అక్కడ స్థాపించబడి దినదినాభివృద్ధి చెందుతున్నది. తన అనుగ్రహంకోరివచ్చిన అనేక మంది రోగులను అమ్మ అక్కడకు పంపుతుంది. మరి, వారి అదృష్టమో, అమ్మ అనుగ్రహమో పలువురికి పలురకాల వ్యాధులు అక్కడ నయమవుతున్నాయి.

**మాతృశ్రీ మెడికల్ సెంటర్ :** అందరికీ ఉచితంగా వైద్య సదుపాయం కలుగచేయటానికీ, వైద్య శాస్త్రంలో పరిశోధనలు జరిపించటానికి సర్వ సన్నాహాలూ చేస్తున్నారు.

**అన్నపూర్ణాలయం :-** అమ్మను చూడటానికి వచ్చే ప్రతివారూ యిక్కడ భోజనం చేస్తారు ఎవరైనా, ఎంతమందైనా, ఏ వేళ అయినా

సరే. ఇది అమ్మకు ఆనందాన్నీ, తృప్తినీ కలిగించే అపూర్వ విషయం. ఈ అన్నదానాన్ని "దానం" అనటం అమ్మ అంగీకరించదు. "తల్లి తన బిడ్డలకు పెట్టుకోవడం దానమెట్లా అవుతుంది" అని అమ్మ ప్రశ్నించటంలోని అంతరార్థం అందరికీ తేలికగా అర్థంకాదు. కుల మత భేదం లేకుండా అందరూ కలసి ఒకే పంక్తిన భోజనం చేయటం యిక్కడ రోజూ మనకు కన్పిస్తుంది. అమ్మకు ధనికులనీ పేదలనీ భేదం లేదు. మంచివాళ్ళనీ చెడ్డవాళ్ళని తేడా కూడా లేదు. చదువుకున్నవాళ్ళనీ, చదువుకోనివాళ్ళనీ వ్యత్యాసమే లేదు. కనుకనే అందరినీ ఒకే వరసన కూర్చోబెట్టి అన్నం పెడుతూ ఏ తేడాలకూ చోటులేని ఆదర్శ సమాజాన్ని అమ్మ చూపుతున్నది. అది కేవలం అన్నంమాత్రమే కాదు అమ్మ అనుగ్రహమూ అనురాగమూ కలిపిన ఔషధమో, అమృతమో అయ్యుండాలి. లేకపోతే దానికి ఆ రుచీ, శక్తి ఎక్కడనుంచి వస్తాయి?

ఇక్కడ ఒక్క మెతుకు కొరికినా చాలు. కలతచెందిన మనస్సుకు శాంతి కలగటమూ, వ్యాధులు నయమై ఆరోగ్యం కలగటమూ ఎంతో మందికి నమ్మకమే కాదు, అనుభవం కూడా.

శేషగిరిరావు అన్నయ్య : అమ్మ అనుంగు బిడ్డలలో ఒకరు. తన జీవితాన్ని అమ్మ సేవకు, అందరింటి అభివృద్ధికి అంకితం చేసుకున్న నిస్వార్థ జీవి. ఈ కీర్తిశేషుని కృషి ఫలితమే మాతృశ్రీ విద్యాపరిషత్.

మాతృశ్రీ విద్యాపరిషత్ కార్యాలయం : పరిషత్ కార్యదర్శి, కాలేజి ప్రిన్సిపాల్, పాఠశాల హెడ్మాస్టర్. విద్యాపరిషత్ ఆధ్వర్యంలో ప్రాచ్య భాషల్లో ఒక పాఠశాలా, ఒక కళాశాలా నడపబడుతున్నాయి. ఆవిద్యాలయాల్లో కేవలం చదువుచెప్పటమే లక్ష్యం కాదు, విద్యార్థులను సుశిక్షితులైన ఆదర్శమానవులుగా రూపొందించాలని నిర్వాహకుల సంకల్పం. అమ్మ ప్రబోధిస్తున్న - సర్వత్రా అనురాగ విధానం మాత్రమే ఉత్తమ మానవుని తయారు చేయగలదని కార్యకర్తల విశ్వాసం. కలిమిలేములతో, కులమతాలతో సంబంధంలేకుండా అందరికీ ఉత్తమ విద్య నేర్పాలని పరిషత్ ఉద్దేశ్యం. ఇక్కడ చదువుకునే వారందరికీ పరిషత్ వారు భోజనమూ, వసతీ ఉచితంగా ఏర్పరుస్తున్నారు

హైమ : అమ్మకు ఇద్దరు కొడుకులు, ఒకే ఒక్క కూతురు. ఆ అమ్మాయి పేరు హైమవతి. హైమ అమ్మ మాదిరిగానే అందరినీ ప్రేమిస్తూ అందరి చేత ప్రేమింపబడుతూ 25 సంవత్సరాలు జీవించింది. 5-4-68 వ తేదీన హైమ చనిపోయింది. సృష్టినంతను తన కన్నబిడ్డగా చూసుకునే అమ్మకు కన్నబిడ్డ కరువైంది.

అమ్మ ఎంతో బాధపడింది. దుఃఖించింది. హైమ గుంటూరు ఆస్పత్రిలో చనిపోయింది. హైమ వెంట గుంటూరు వెళ్ళిన అమ్మ తిరిగి వచ్చింది. అమ్మ వచ్చేటప్పటికి అమ్మ దర్శనంకోసం వచ్చిన జనం దారి పొడుగునా బారులు తీరి నిలుచున్నారు. అందరికీ హైమ ఎట్లా వుందోనని ఆలోచన, ఆందోళనే. కాని ఎవరు అమ్మను అడుగుతారు! ఎవరూ అమ్మ ముఖమే చూడలేక పోయారు. నడవలేక నడుస్తూ అమ్మ అందరి వంకా చూసింది. ఏదో మాట్లాడబోయింది గొంతు పెగల్లేదు దుఃఖంతో పూడిపోయింది. కళ్ళతో చేత్తో సంజ్ఞ చేసింది- "అంతా అన్నం తిన్నారా-" అని, ఇంతలో వెంట వచ్చిన ఎవరో అన్నారు హైమ పోయిందని. జనం ఒక్కసారి బావురు మన్నారు. వెక్కి వెక్కి ఏడ్చారు. హైమ పోయిందనే కాదు, అమ్మను చూడలేక. తన కడుపులో గంపెడు దుఃఖం పెట్టుకుని మన కడుపు తడుపుతోంది. ఎంత పిచ్చి అమ్మ!

మరునాడు హైమ శరీరానికి పాలాభిషేకం జరిగింది. తన నివాసం ముందే అమ్మ భూసమాధి చేసింది. ఆసమయంలో హైమనుసిద్ధాసనంలో కూర్చోబెట్టి హైమ తలపై కుడికాలు నుంచింది. హైమలో ప్రాణ ప్రతిష్ఠ జరిగింది. జీవలక్షణాలు కనిపించాయి. తలపై నుండి రక్తంస్రవించింది. అప్పటిదాకా శోకమూర్తిలా వున్న అమ్మలో దివ్యప్రభలు ఉజ్వలమై వెలిగినయ్.

అద్వైత సిద్ధిదాయిని - అమ్మ :

హైమకు అమ్మ దైవత్వం ప్రసాదించిందనటానికి ఆధారమైనవి అనేక దర్శనాలు - నిదర్శనాలు. నేడక్కడనే హైమాలయం నిర్మాణ

మయింది. అమ్మ కార్చిన కన్నీళ్ళే నేడు మన దప్పికను తీరుస్తున్నయ్. ఆ కన్నీళ్ళ కాసారంలోనే వేయి రేకులుగా దివ్యకమలం విప్పారింది. అదే హైమాలయం.

పాట : అల్లదే హైమాలయం - అది చల్లని దేవాలయం
పవిత్ర ప్రేమ విరాజితం - ప్రఫుల్ల శాంతి మహార్ణవం ॥అల్లదే॥
మూర్తిల్లిన ప్రేమ - మృత్యుంజయ హైమ
సిద్ధిపొందిన దివ్యసీమ - శిల్పమై నిలిచింది హైమ ॥అల్లదే॥
అవటరాళ్ళలో అన్ని అణువులు - అమ్మ రాల్చిన అశ్రుకణములు
మలచినట్టి అన్ని శిలలు - మానవుల కన్నీటి అలలు ॥అల్లదే॥
అనసూయ అను పేరు - అమ్మా అను పెనుహోరు
జయ హోమాత శ్రీ అనసూయ
రాజరాజేశ్వరి శ్రీపరాత్పరి
ఆగదచ్చట ఒక్కమారు - మూగవోదే ఒక్కనోరు ॥అల్లదే॥
చిట్టితల్లికి ఇల్లదే - చిన్నారి హైమకు తల్లదే
పుణ్యముల పుట్టిల్లదే - పున్నమి వెన్నెల జల్లదే ॥అల్లదే॥

(- నదీరా)

## హైమాలయం :

హైమాలయంలో ప్రతి రోజూ ఉదయం మహాన్యాస పూర్వక ఏకాదశ రుద్రాభిషేకమూ, సాయంకాలం లలితాసహస్ర నామార్చనా జరుగుతాయి. అక్కడ రోజూ ఎందరో తమ కోరికలను హైమవతీదేవికి విన్నవించుకుంటారు. ఆపదల్లో ఉన్న ఎందరో ప్రార్థనలు చేస్తూంటారు. పిల్లలకోసం కొందరు ప్రదక్షిణాలు జరుపుతుంటారు. కరుణామయి హైమవతీదేవి అందరికోరికలను తీరుస్తుంది. ఇక్కడ కోరినకోరిక వృథా కాదు. అందు వల్లనే హైమాలయానికి కొద్ది రోజుల్లోనే కల్ప వృక్షమనీ, కామధేనువనీ పేరొచ్చింది. ఆ ఆలయంలో అడుగు పెట్టగానే ప్రతివారికీ ఎక్కడా దొరకని మనశ్శాంతి లభిస్తుంది. హైమవతీదేవి చాలామందికి ప్రత్యక్షంగా కనిపిస్తూ వుంటుంది. ఆ చరణమంజీరాల మృదురవళులు కొందరికి వినిపిస్తూవుంటాయి. హైమవతీదేవి ఎందరో ఆర్తులకు తన చల్లని చేయూత నిచ్చి ఆపదల నుండి ఆదుకున్నది. ఆ కారుణ్యానికి మహిమకు హద్దులేవు.

### అఖండనామం :

ఇక్కడ " జయహో మాతా
శ్రీ అనసూయా
రాజరాజేశ్వరి
శ్రీ పరాత్పరి " - అనే

నామ సంకీర్తన నిరంతరం జరుగుతూ వుంటుంది. జట్లు జట్లుగా ఎల్లప్పుడూ రాత్రింబవళ్ళూ చేస్తూనేవుంటారు. కొత్తగావచ్చినవాళ్ళు కూడా ఆనామంలో పాల్గొనవచ్చు. అట్లాగే లోపల దీపారాధన కూడా అఖండంగా వెలుగుతూ వుంటుంది.

### అమ్మ దర్శనం :

అదిగో - గంట కొడుతున్నారు. ఇక కొద్ది క్షణాల్లో అమ్మ దర్శనం ఇస్తుంది. అందరూ వెళ్ళవచ్చు. ఎవరి అనుమతీ అవసరంలేదు.

ఈ జగజ్జనని ఆలయంలో ప్రధాన అర్చకుడు, ఈ విశ్వమానవాలయం ముఖ్య సేవకుల్లో ఒకడు, అమ్మ అంతరంగిక కార్యదర్శి - రామకృష్ణ అన్నయ్య.

బిడ్డలకు దర్శనం యివ్వటం కోసం అమ్మ తన మందిరం నుండి బయటకు వచ్చింది రోజూ కనీసం ఒక్కసారైనా యిట్లా వచ్చి అందరకూ దర్శన మివ్వటం అమ్మకు అలవాటు.

ఆ పాదాలు........ సుందర మందార కుసుమ మంజులాలు
సర్వదేవతలకూ నివాసమందిరాలు
సువర్ణ రాగ రంజితాలు - సర్వజన పూజితాలు
తేజఃపుంజ్వల - భాను భాసుర
శాంత వైభవ రమణీయ మూర్తి -

కనుబొమల నడుమ అరుణ బింబాన్ని పోలిన కుంకుమ బొట్టు, ముక్కున మెరిసే బులాకీ, సర్వ నరనారీజన - హృదయేశ్వరి - జగజ్జనని - పేరు అనసూయ - కాని అందరూ మనసారా 'అమ్మ' అనే పిలుస్తారు.

ఆ కన్నులు కమలాల కన్న కమనీయమైనవి,
ఆ చూపులు సూర్యకిరణాల కన్న చురుకైనవి.

ఆ చల్లదనం వెన్నెలకూ్కడా లేదేమో........!
మరి అవేమిటి ! కన్నీటి బిందువులా !
కాదు........ కారుణ్య సింధువులు.
ఆ ఆర్ద్రితే సర్వ జగతికీ శ్రీరామరక్ష.

అమ్మను పూజించుకోవటంలో ఒక పద్ధతి అంటూ లేదు. ఎవరి యిష్టం వారిది. అమ్మ అందరి విధానాలనూ ఒప్పుకుంటుంది.

కొందరు దండలూ పూలూ అమ్మ పాదాలపై సమర్పించి తమ భక్తిని వెల్లడించు కుంటారు. మరి కొందరు అమ్మకు పూల దండలు వేసిఆనందిస్తారు. పాదాలపై పోసినా, మెడలో వేసినా ఆపూలఅందంతో, ఆపూలరంగులతో పోటీపడే అమ్మ చరణ కమలాలనూ, ముఖపద్మాన్నీ చూసి అందరూ మురిసిపోతారు.

## అమ్మ ప్రసాదం :

అన్నంపెట్టినట్లు అందరికీ పెట్టకపోయినా ఎందరో బిడ్డలకు గుడ్డలు కూడా పెట్టి అమ్మ ఆశీర్వదిస్తుంది. పెండ్లిచేసుకు వచ్చిన క్రొత్త దంపతులకూ పెడుతుంది. ఆప్తులను కోల్పోయి గంపెడు దుఃఖంతో వచ్చిన వారికీ పెడుతుంది. పెద్దవాళ్ళకూ పెట్టవచ్చు. పేద వాళ్ళకూ పెట్టవచ్చు. అమ్మ అనుగ్రహం ఎవరిపై ఎప్పుడు ఏవిధంగా కలుగుతుందో ఎవరు చెప్పగలరు!

అమ్మ అనుగ్రహం అర్థం కానిదీ
ఆ అనురాగం అంతులేనిదీ కదా!

అమ్మ అందరికీ కుంకుమ ప్రసాదిస్తుంది. ఆ కుంకుమ సర్వార్థ సాధకమైంది. ఆధి వ్యాధులకది దివ్యౌషధం. కొందరు దానిని బొట్టు పెట్టుకుంటే, మరి కొందరు దానిని నీటిలో కలుపుకుని త్రాగుతారు.

కొందరు అమ్మకు పసుపుకుంకుమలు సమర్పిస్తారు. అమ్మ ఆ చీరెను తాను పైన కప్పుకొని 'కట్టుకున్నట్లే' అంటూ వారికి బొట్టు పెట్టి ఆ చీరెను తిరిగిస్తుంది.

"మీరు కట్టుకుంటే నాకు తృప్తిగా ఉంటుందమ్మా" అంటుంది. నవ్వుతూ, ప్రేమను కురిపిస్తూ ఇవ్వటమే కాని తీసుకోటం తెలీదు తల్లికి.

రోజూ అమ్మను దర్శించేందుకు ఎందరు వచ్చినా అందరూ ఒక్కొక్కరే అమ్మ వద్దకువచ్చి, అమ్మ పాదాలుతాకి నమస్కారం చేసుకోవచ్చు. అవకాశ ముంటే ఆ చరణరాజీవాలను పూలతోనో పత్రాలతోనో పూజించుకోవచ్చు. అదృష్టముంటే పంచామృతాల తోనో, పయోధారలతోనో సర్వ శివంకరమైన ఆ పాదాలను అభిషేకించుకోవచ్చు.

అందరికీ అందుబాటులో ఉండటమే ఈ అవతారం లోని ఒక విశేషం. తాము తీసుకు వెళ్ళిన ఏ నివేదన అయినా అమ్మకు సమర్పించుకోవచ్చు. ఏదో ఒకటి తీసుకువెళ్ళాలనీ నియమమూ లేదు. అమ్మ మాత్రం అందరికీ ప్రేమతో ప్రసాదం ఇస్తుంది. అది కుంకుమ కావచ్చు, పండు కావచ్చు, పువ్వు కావచ్చు, పూరేకు కావచ్చు. దాని రూపం ఏమైనా అందులో సర్వ శక్తివంతమైన అమ్మ దయ నిండి ఉంటుంది. వధూవరులు తమ జీవితాలు అన్యోన్య దాంపత్యంతో సుఖమయం కావాలనీ, మూడు పువ్వులూ, ఆరు కాయలుగా వర్ధిల్లాలనీ అమ్మను వేడుకుంటున్నారు. వారిద్దరికీ పూల దండలు వేసి " మీ అండన నేనున్నా"నంటూ ఆశీర్వదించింది అమ్మ.

## పుమతల గర్భ గుడి :

అమ్మ దర్శనం కోసం వచ్చినవాళ్ళలో ఎక్కువ మంది అమ్మ సమిష్టి దర్శనం చేసుకుని వెళ్ళిపోతారు. వాళ్ళ కంతవర కేచాలు. వాళ్ళ కదే తృప్తి. కానీ కొందరుంటారు. వాళ్ళ బాధలో, సందేహాలో అమ్మకు స్వయంగా విన్నవించుకుంటేనేగానీ వారికి మనశ్శాంతి ఉండదు. అటువంటివారికి ఆ అవకాశం వుంది. మరి అమ్మ అంటే అడ్డులేంది కదా!. అమ్మ అతడ్ని పిలిచి దగ్గరకు తీసుకుంటోంది. అతడు అమ్మ ఒళ్ళో వాలిపోయాడు.

ఆ ఒడి మమతల గర్భగుడి. అమ్మ ప్రేమగా, గోముగా అతని తలనూ, వెన్నును నిమురుతోంది.

ఆ స్పర్శలో ఎంత హాయి ఉందో!

ఆ చేతిలో ఎంత చల్లదనం ఉందో!

ఆ విశిష్టత్వంలో అతని అంతరంగంలో ఏ భావ విప్లవం రగిలిందో, హృదయంలో కరడు గట్టిన విషాద మేఘాలకు చల్లని గాలే తగిలిందో........ అతనిలో దుఃఖం పెల్లుబికింది. ఎంత మందికో సాధారణంగా కలిగే అనుభవమే. అందుక్కారణం ఒక్కొక్కళ్ళ విషయంలో ఒక్కొక్కటి కావచ్చు.... కొందరికి కారణమే లేకపోవచ్చు. వారికే తెలీదు వారెందుకు ఏడుస్తోందీ – వాస్తవానికి అది ఏడుపుకూడా కాదు;

అశోక పరిణామ దశ–

అమ్మ అతడికి పాదాల నందించింది.

ఆ పాదాల్లో.... సర్వ జీవుల సమస్త

మాలిన్యాలను కడిగివేసే పావన గంగ

కనిపించింది. అమ్మ అరటి పండు ఒలిచి అతడికి పెడుతోంది. ఆ పండు ఎంత తియ్యగా ఉందో. అది అమ్మ వాత్సల్యామృతంలోని మాధుర్యం గదా. "నువ్వు తినమ్మా" అని అతడు వేడుకుంటున్నాడు. అందరూ మామూలుగా అమ్మ పెడితే తినాలని కోరుకునేవాళ్ళేగానీ అమ్మ తినాలని సామాన్యంగా అనకోరు. చిన్నతనంనుంచీ అమ్మను తినమని కోరిన వాళ్ళు బహు అరుదు. కానీ అతడు అమ్మను కొంచెమైనా తినమని మరీ మరీ బతిమాలుతుంటే అమ్మ చినతాతగారు చిదంబరరావుగారు గుర్తుకు వస్తున్నారు.

అతను అంజలి ఘటించి వేడుకుంటున్నాడు. తనకు లోకంలో సుఖపడటానికి అవసరమైనవన్నీ ఉన్నాయట. కానీ ఏదో కాలితి. ఇన్నాళ్లూ దానికి కారణం తెలియలేదు. చిన్నతనంలోనే తల్లిని కోల్పోయాడతడు. నేడీ అమ్మను చూడగానే ఆ వెలితి ఏమిటో అతనికి స్పష్టంగా తెలిసిందట. అతడ్ని ఓదారుస్తూ – "నీవే కాదు, నాన్నా – తల్లి లేని వాళ్లెవరూ లేరీ లోకంలో. అందరికీ అమ్మవుంది. అందరూ

నా బిడ్డలే. ఈ ఒకి విడిచి ఎవరూ ఎక్కడికీ పోలేరు. నేను అమ్మను. మీరు బిడ్డలు. నువ్వు దిగులుపడకు. నువ్వెక్కడున్నా నీ వెంటనే ఉంటాను.

అమ్మ అంటే జిల్లెళ్ళమూడిలో యీ మంచం మీద కూర్చున్న దేకాదు; అమ్మ అంటే ఆదీ అంతం లేనిది. ఆదీ అంతం అయింది కూడా-" అని చెప్పి అతడికి ధైర్యాన్ని కలిగిస్తూ ఆశీర్వదిస్తున్నది.

అమ్మను చూడగానే ఎవరికైనా ప్రస్ఫుటంగా కనిపించేది అమ్మలోని నిర్లిప్తత. అమ్మలో మామూలుగా ఏభావం కనుపించదు. ఆ ముఖం ఎప్పుడూ ప్రసన్నంగానూ, అతిప్రశాంతంగా నూ వుంటుంది. అ చూపులు అమ్మ దిగంతాలకు చూస్తున్నదా అన్నట్లుంటాయి. ఒక్కొక్కసారి అమ్మ ఒక్కొక్కరిని చూస్తుంది. మనం అమ్మనుచూస్తేనే మనకెంతో తృప్తిగానూ, హాయిగానూ వుంటుంది. ఇక, అమ్మ మనను చూసిందా మన బ్రతుకు పండి పోయినట్లే. ఒక్కసారి అమ్మ మనను చూసినా చాలు. మనం మరిచిపోయినా అమ్మ మనను మరిచిపోదు. అమ్మ మనస్సులో మనం శాశ్వతంగా నిలిచిపోతాము. అంతకంటే ఎవరికైనా కోరుకోదగిందేముంటుంది! అతడు అమ్మకు విన్నవించుకుంటున్నాడు. అమ్మను చూసింతర్వాత అతనికి సంసారంలో శుభాలట, వ్యాపారంలో లాభాలట. అంతా అమ్మ చలవేనని అతడు కృతజ్ఞత తెలియ జేస్తున్నాడు.

"నన్ను చూసినందు వల్లగాదు, నాన్నా- ఆతరుణం వచ్చింది, అవి జరుగుతున్నాయి" అని సమాధానం చెబుతోంది అమ్మ. అమ్మ దయవల్ల అనేకులకు అనేకశుభాలు కలగటం, మహిమలు జరగటం సర్వసాధారణమే అయినా దేనిని అమ్మ తాను చేశానని ఒప్పుకోదు. అన్నిటికీ కాలమే కారణం అంటుంది. మరి, ఆ కాలం ఎవరో-

అతడు వ్యవసాయంలో తానను భవించే కష్టసుఖాలు చెప్పుకుని -బాగా పంటలు పండించమ్మా- అని అమ్మను వేడుకుంటున్నాడు.

"నీకున్నది నువ్వు నలుగురికి పెట్టునాన్నా- నీకొక్కవల్సింది భూమి నీకు తప్పక ప్రసాదిస్తుంది-" అని అతనికి ప్రసాదంతో బాటు హామీ నిచ్చింది అమ్మ.

## అందరిల్లు :

అమ్మ తనపేరు "అమ్మ" అన్నట్లు తన నివాసానికి "అందరిల్లు" అని పేరు పెట్టుకుంది. అమ్మ- అందరిల్లు.... అన్న పేర్లలోనే అమ్మలోని విశ్వజనీనత, విశాల హృదయం స్పష్టంగా తెలుస్తున్నయ్. తనయింటికి "అందరిల్లు" అని నామకరణం ఎవరు చేస్తారు? ఇది అమ్మకు మాత్రమే సాధ్యం. అమ్మ అని అనుకోవటంలో, పిలవటంలో ప్రతి ఒక్కరికి ఆ ప్యాయత, హృదయ పరిస్పందన ఎట్లాకలుగుతయ్యో, అందరిల్లు అని వినగానే, ఎవరికి వారికి, యిది తనయిల్లు అనిపించి, అందరికి సమానమైన హక్కులు, బాధ్యతలు ఏర్పడుతయ్. ఇక్కడ అన్ని కులాల వాళ్ళు, అన్ని గుణాల వాళ్ళు ఉన్నారు.

అమ్మసేవ చేసుకోవాలనే ఆసక్తితో కొందరు, నిరంతరం అమ్మను చూడాలనే అభిలాషతో కొందరు, రోజూ అమ్మను చూట్టానికి వచ్చే వందలాది యాత్రికులకు అవసరమైన సౌకర్యాలుకలగజేయటం కోసం కొందరు అనేకులు యిక్కడ స్థిరపడి నివాసం చేస్తున్నారు. ఇక్కడ నివాసం సమస్యలతో చికాకుపడేవారికి పొదరిల్లు - యీ అందరిల్లు సమస్త వర్ణాలకు ఆకరమైన హరివిల్లు.

## నవరాత్రి ఉత్సవాలు :

అన్ని పండుగల్లో అమ్మకు అతివైభవోపేతంగా పూజలు జరుగుతాయి. దేవీ నవరాత్రి ఉత్సవాలకు మరింత ప్రాధాన్యత ఉంది. మరి అమ్మ సాక్షాత్తూ రాజరాజేశ్వరి అవతారం కదా! మామూలుగా ఎంతో ప్రసన్నంగా, అతి సన్నిహితంగా, మనతో, మనలో, మనవలే మెసలే అమ్మ ఆ పూజా సమయాల్లో.... ఉన్నతాసనం అలంకరించి కిరీట ధారిణియై, త్రిశూల హస్తయై, అనలనేత్రియై, గంభీర వదనయై, దుర్గమయై, దుర్లభయై, దుర్నిరీక్ష్యయై దుర్గవలె, కాళీవలె, చండీవలె, వివిధ మూర్తులలో విరాజిల్లుతూ అందరికీ అభయమిస్తుంది.

స్తోత్రం:

అయి బుధనందిని భూసుర నందిని నందన నందిని నందినుతే
సకల వికార విదూర మదూర ముదార తపో మహతాం మహతాం
తవచరణం శరణం కరవాణి హి వాణి సుమాంచిత వేణి ముదా
హర హర హైమవతీ జనయిత్రి సమస్తపవిత్రి మమాఘ భరమ్॥
పరమ పవిత్ర విచిత్ర చరిత్ర జగత్రయతోషిణి భవ్యమతే
సకలకలా కమనీయ కలాప కలారవలాలిత కంబుగళే
జగదభయంకరి సర్వ శివశంకరి భర్తృ పదాంబుజ బంభరికే
హర హర హైమవతీ జనయిత్రి సమస్త పవిత్రి మమాఘభరమ్॥
అహితహితాది విభేద విహీన మహీన మహీన వచో విషయం
విషయ సుఖాగ్ని విలగ్న విభుగ్న హృదామగమం మహనీయ తమం
వహసి మహాద్భుత సంభృత వృత్త మహో మహిమః ప్రసరం మహి తే
హర హర హైమవతీ జనయిత్రి సమస్త సవిత్రి మమాఘభరమ్॥
హృదయ వికర్షి మహర్షి రహీశ దృగస్రి విమశ్రి సహస్రిక ధే
సదసదనుగ్రహ నిగ్రహ సాగ్రహ దుర్గ్రహ శక్తి సమగ్ర పథే
మతి మదనల్ప వికల్పిత జల్పిత శిల్ప సుతల్పిత నిర్ణయదే
హర హర హైమవతీ జనయిత్రి సమస్త సవిత్రి మమాఘభరమ్॥
అయికుమనస్సు సుమనస్సు మతామమతా సమతావక పాదమహీ
మధివసతాంబ సతాహసి తాహి సితాసిత భాసిత దృష్టి రహో
ప్రశయ విషామృత దోహన దోహల కేవల మోహన చిత్రగతే
హర హర హైమవతీ జనయిత్రి సమస్త సవిత్రి మమాఘభరమ్॥

— డా॥ పన్నాల రాధాకృష్ణ శర్మ.

నవరాత్రి ఉత్సవాల్లో అమ్మను దర్శించటానికి ఎంతెంత దూరాన్నుంచో అనేకులు వస్తారు. సర్వజ్ఞ, సర్వశక్తిమయి, సర్వసృష్టిస్థితిలయకారిణి అయిన పరమేశ్వరి, పరాశక్తి, పరాంబిక మానవరూపంలో మన మధ్య తిరుగుతున్నది-అని తెలుసుకున్న తర్వాత ఆ విశ్వ సమ్మోహనమూర్తిని కనులారా చూసే పరమభాగ్యాన్ని ఎవరు వదులుకుంటారు? ఆ పావన పాదాలను తాకే అదృష్టాన్ని ఎవరు జారవిడుచుకుంటారు?

అందుకనే అవకాశం దొరికిందే చాలని ఆ చరణాలకు నమస్కరించు కోవాలని, ఒకరికంటే ఒకరు మరింత త్వరపడుతున్నారు. తమ బిడ్డను ఆశీర్వదించమని అమ్మకు అందించారు. వాడిని మమతల గర్భగుడిదైన తన ఒడిలోకి తీసుకుని తిరిగిచ్చింది. అమ్మకు పసిపాపలంటే ఎంతో ముద్దు.

.........ఉపన్యాసచక్రవర్తి-హిందూ మతోద్ధారకులూ శ్రీ ఉమా మహేశ్వరపండితులు తమగ్రంథాలను అమ్మకుసమర్పించుకుంటున్నారు. .........ఎందరో ముత్తయిదువులు తమపసుపు కుంకుమలు కలకాలం నిలవాలని కోరుకుంటూ అమ్మ సన్నిధిలో నోములు నోచుకుని సర్వమం గళ అయిన అమ్మకు వాయినాలిస్తుంటారు.

........ఎందరో బిడ్డలకు అమ్మచేత 'నామకరణం' చేయించుకుంటారు. తరచుగా అమ్మ ఆడపిల్లయితే "వాత్సల్య" అనో, 'హైమ" అనో మగపిల్లవాడైతే "ప్రేమకుమార్" అనో- "రహీ" అనో పేర్లు పెడు తుంది. అమ్మ దృష్టిలో అన్ని పేర్లూ సమానమే అయినా యీపేర్లంటే అమ్మకు చాలా యిష్టం.

## క్లేశ ఖండన :

కొందరు అమ్మను వేంకటేశ్వరస్వామిగా పూజిస్తారు. అందుకనే తమ జుట్టును ఏడుకొండలవాడికి బదులుగా అమ్మ సన్నిధిలో సమర్పిం చుకుంటారు. ఒకసారి అమ్మ అన్నది.... "ఇది కేశఖండన కాదు; క్లేశ ఖండన" అని. అంటే జుట్టుతోపాటు వారి కష్టాలకు కూడా అమ్మ కత్తెర వేస్తున్నదన్నమాట.

## అక్షరాభ్యాసం :

కొందరు తమ పిల్లలకు అమ్మచేత అక్షరాభ్యాసం చేయించు కుంటారు. సర్వ విద్యలకూ అధిదేవత అయిన సరస్వతే అమ్మ. అమ్మ అక్షరాలు దిద్దబెడితే చదువు నిరాటంకంగాసాగుతుంది, ఆ చిరంజీవులు బాగా చదువుకుని ప్రయోజకులవుతారు అని ఆ తల్లిదండ్రుల నమ్మకం. సర్వ విద్యలకూ సారం ఆత్మ జ్ఞానమే కదా! ఆ పరమాత్మే అమ్మయి,

తన చెయ్యి పట్టుకుంటే అంతకన్న విద్యకు ప్రయోజనమేముంది! సద్యః ఫలితమంటే యిదే!

## ఖాతాలు ప్రారంభం :

కొందరు వర్తకులు తమ లెఖ్ఖల పుస్తకాలను అమ్మచేత ప్రారంభం చేయింపుకుంటారు. అమ్మ లక్ష్మి స్వరూపిణి కదా!

కవులు రచనలు ప్రారంభించే ముందు "తల్లీ! నిన్ను దలంచి పుస్తకము చేతన్ బూనితిన్" అంటూ అంజలి ఘటిస్తారు.

## అన్నప్రాశన :

అన్నపూర్ణేశ్వరి అయిన అమ్మకు ఎవరికైనా అన్నప్రాశన చేయటమంటే చాలా సంతోషం. అమ్మ చేత్తో ఏం పెట్టినా అది అమృతమే. అందులో ఇది పంచదార లడ్డు కదా!

......అమ్మ శమీచీట్లను పంచుతున్నది. తాము చేసిన పుణ్యాలకైనా, పాపాలకైనా తమకేమీ బాధ్యత లేదని అమ్మ ఘంటాపథంగా చెబుతున్నది. అయినా తాము చేసిన పాపాలన్నిటినీ క్షమించవలసిందిగా అందరూ అమ్మను వేడుకుంటున్నారు.

........ఒక పాపను మొట్టమొదటిసారి అమ్మ ఉయ్యాలలో వడుకోబెడుతున్నది. ఏ బిడ్డకైనా ఏ వేడుకైనా అమ్మ తన బిడ్డకు చేసుకొన్నట్లే అతి శ్రద్ధగా చేస్తున్నది. అందుకనే అమ్మ అన్నది "అందరినీ తానే కన్నాననిపిస్తుందట; ఆయా తల్లులకు పెంపు డిచ్చిందట. అసలైన అమ్మకు ఎవరిని చూసినా తనబిడ్డే ననిపించటం సహజమేకదా!

........ దేవీనవరాత్రి ఉత్సవాలలో హైమాలయంలో జరిపిన పూజకు ఉపయోగించిన పూలూ.... పత్రి.... దశమి రోజున ఊరు పరిక్రమ ప్రవహించే వాగులో కలపటం అలవాటు. అందుకోసం ఆ పత్రిని అందరూ కలసి నామ సంకీర్తనతో, మంగళ వాయిద్యాలతో తీసుకువచ్చారు. ఆ పత్రిని అందరూ కలసి ఉత్సాహంతో నీటిలో కలుపుతూ ఆనందిస్తున్నారు.

## జిల్లెళ్ళమూడి రోడ్డు :

జిల్లెళ్ళమూడి రోడ్డుకి అమ్మ ప్రారంభోత్సవం చేస్తున్నది. 1956 నుంచే అమ్మను చూడ్డానికి ఎంతో మంది జనం వచ్చేవారు. అయినా దారీ డొంకా లేదు. అందరూ పొలాల గట్ల వెంబడి, కాలువలు దిగుతూ గట్లెక్కుతూ వచ్చేవాళ్ళు. క్రమంగా దారి ఏర్పడింది. తర్వాత మట్టిరోడ్డు పడింది. చివరకు 1972 లో జిల్లాపరిషత్తువారు మెటల్ రోడ్డు వేసి యాత్రికులకు సౌకర్యం కలుగజేశారు.

## వ్యవసాయం :

అందరింటిలో వ్యవసాయానికి ఎక్కువ ప్రాముఖ్యం ఉంది. చేలో ధాన్యం పండి ఇంటికి వస్తే కదా- ఎవరికింత పెట్టడానికైనా. అందుకనే అందరింటిని చూడగానే వ్యవసాయ ప్రధానమైన ఒక సమిష్టి కుటుంబం అనిపిస్తుంది. చదువుకున్న వారనీ, చదువుకోని వారనీ తేడాల్లేకుండా అందరూ కలసి పనులు చేసుకోవటం ఇక్కడివారికి అలవాటు.

కుప్పలు నూరుస్తున్నారు; ఆడవాళ్ళూ మొగవాళ్ళూ అందరు కలసి పనిచేస్తున్నారు. అమ్మ ఒక సందర్భంలో అన్నది: "చేయలేక మనకు తేడాలేగాని ఆడపనీ, మొగపనీ అంటూ ప్రత్యేకంగా ఏమీ లేదని". మొత్తానికి ఏ పనైనా గాని, అందరూ కలసి హాయిగా చేసుకుంటూ కడుపునిండా తాము తింటూ, తమ కష్టంతో యితరులకు అన్నం పెడతారు.

అమ్మ ఎప్పుడూ మామూలుగా ఏ సందేశమూ ఇవ్వదు. కాని ఒక సందర్భంలో మహోత్కృష్టమైన ఒక సందేశాన్నిచ్చింది.

"నీకు ఇచ్చింది తృప్తిగా తిని, యితరులకు ఆదరణగా పెట్టు" అని. అమ్మ జీవితాన్ని పూర్తిగా పరిశీలిస్తే, బిడ్డల ఆహారం విషయంలో అమ్మ ఎంత శ్రద్ధ తీసుకుంటుందో మనకర్థమవుతుంది. అసలు మనిషి ఆకలి బాధను అమ్మ గుర్తించినంతగా మరెవరూ గుర్తించలేరేమో. ఆమ్మే ఒకసారి అన్నది, "అన్ని బాధల కంటె నాకు ఆకలి బాధే

ఎక్కువ అనిపిస్తుంది" అని. తాను మాత్రం ఇతరుల ఆకలిని తీర్చడానికే అలవాటు పడింది. అందుకనే అన్నానికి ఆధారమైన భూమిని దైవంగా పూజించమని అమ్మ పదే పదే ప్రబోధించింది. ఆ భూదేవి అవతారమే అమ్మ అని పలువురి విశ్వాసం కూడా.

ఆవులతో, ఎద్దులతో, కోడెలతో, గేదెలతో ఆవరణమంతా ఎప్పుడూ కనుల పండువగా వుంటుంది. తాము గడ్డి మేస్తూ తమకు ఆ మేత పెట్టిన మనుషులకు పాలధారలు అందించి ఆనందపడే గోజాతి త్యాగానికి పెట్టింది పేరేకాదు; మానవ జాతికే ఆదర్శమేమో! ఐతే అందుకే యీ జాతి అంటే అమ్మ కింత ఇష్టమందామా? కాదు-పాలు పోసిన చేతినే కాటువేసే పాములన్నా అమ్మకు ఇష్టమే. జీవితంలో చాలా కాలం అమ్మకు పాములతోనే స్నేహం.

ఒకసారి ఒక సోదరుడు అనేక ఆలోచనలతో సతమతమవుతూ "నీ వెవరమ్మా" అని అడిగాడు. "అమ్మను" అని చెప్పింది.

"నీకూ, మీకూ అందరికీ" అని వివరించింది.

"పశువులకూ, పక్షులకూ, క్రిమికీటకాదులకు"

కూడానని తన సర్వ మాతృత్వాన్ని ప్రకటించింది. కనుకనే రోజూ తన నివాసం నుండే పశువులన్నిటికీ మేత సరిగా అందుతున్నదీ లేనిదీ స్వయంగా చూస్తుంది అమ్మ.

## యదార్థ వాది - అమ్మ :

అమ్మ అన్ని పండుగలనూ ప్రోత్సహిస్తుంది. అన్ని సంప్రదాయాలను మన్నిస్తుంది. అట్లా అని అన్నిటినీ గుడ్డిగా అంగీకరించదు.

ప్రతి చిన్న విషయాన్ని సహేతుకంగా పరిశీలిస్తుంది.

"ఇది ఏమిటి?' అనేదే అమ్మ ఉపదేశించే పంచాక్షరి.

"అసలు ఇది ఏమిటి?" అనేది అమ్మ ప్రవచించే అష్టాక్షరి. అన్ని వ్రతాలనూ, అన్ని పండుగలనూ అమ్మ అంగీకరిస్తూ వాటిలోని పరమార్థాన్ని గ్రహించమని చెబుతుంది. అమ్మ ప్రవచించే అన్ని

సిద్ధాంతాలకూ పరమార్థం- "అంతా ఒకటే" నని.

"వెలుగూ, చీకటీ రెండు కావు.
మంచీ, చెడూ అని రెండు లేవు.
జ్ఞానం, అజ్ఞానం
సత్యం, అసత్యం
సౌందర్యం, వికారం-అన్నీ ఒక్కదానివే"-

అనేదే అమ్మ అభిప్రాయం అట్లాగే అమ్మదృష్టిలో అన్నమూ, అశుద్ధమూ......... రెండూ పరబ్రహ్మ స్వరూపమే. మరి అన్నం యొక్క పరిణామమేకదా అశుద్ధం. అట్లా అన్నిటియందూ ఒక్కదానిని చూడ టమనేదే ఏకాగ్రిత అనీ, ఆసర్వసమాన స్థితియే సమాధి అని అమ్మ నిర్వచిస్తుంది-

ఈ పరమ సత్యాన్ని మనకు వివరించటానికే- ఆవు పేడతో సందె గొబ్బెమ్మను చేసి దాన్ని సర్వ మంగళగా భావించి ఆరాధించ మనీ పూర్వులు సందేశమిస్తున్నారు అంటుంది అమ్మ.

## బొమ్మల కొలువు :

అన్నిటినీ దైవంగానే కొలువు అనేదే- అమ్మ నిరంతరం వినిపించే మేలుకొలుపు.

## హరిదాసు :

వృత్తిచేతనూ, ప్రవృత్తి చేతనూ హరిదాసై తన జీవితాన్ని సతీ సమేతంగా అమ్మ సేవకు అంకితం చేసుకున్న ధన్యజీవి.

## రాధాకృష్ణ రెడ్డి :

నిరంతరం అమ్మ నామంలో తాను కరిగిపోతూ ఇతరులను కరిగింపచేసే నాదయోగి.

## నామ మంత్రం :

జయహో మాతా
శ్రీ అనసూయా
రాజ రాజేశ్వరి
శ్రీ పరాత్పరి.

**ఉగాది :**

ప్రతి పండుగనాడూ ఎవరో ఒకరు యథావిధిగా పూజ చేసు కున్న తరువాత అందరికీ నమస్కారాలు చేసుకునేందుకు అవకాశం ఉంటుంది. చివరి మనిషి కూడా పాద నమస్కారం చేసుకుని, ప్రసాదం తీసుకోవచ్చు- అంతవరకూ ఎంత శ్రమనైనా లెక్క చేయక అలాగే కూర్చుంటుంది అమ్మ. అది ఎంతకాలమైనా సరే. "అమ్మకు బిడ్డలపై మమకారం అటువంటిది. అమ్మే ఒకసారి అన్నది- తనను కన్నవాళ్ళ మీద కంటేతాను కన్నవాళ్ళమీదే ఎవరికైనా ప్రేమ ఎక్కువ." సర్వాభరణ సంశోభిత; అమ్మ దృష్టిలో మట్టీ, మాణిక్యమూ సమా నమే. మట్టిని బంగారంగా చూసిన సంఘటనలూ, బంగారాన్ని మట్టిగా విసిరేసిన సందర్భాలూ, అనేకం వున్నాయి. అమ్మ స్నానం చేసేవేళ పరమ శివునివలె అభిషేక ప్రియ. పూజా సమయంలో లక్ష్మీనారా యణునివలె అలంకార ప్రియ.

- అమ్మ ఏం చేసినా మనకోసమే.
తాను స్నానం చేసినా మనకోసమేనట.
తనకు పని అంటూ ఏమైనా ఉంటే అది
మనకు కనిపించటమేనట.

**భోగిపళ్ళు :**

అమ్మ నాన్నగారికి భోగిపళ్ళు పోసేందుకు వస్తున్నది. నాన్న గారు - అమ్మకు పతిదేవులు శ్రీ బ్రహ్మాండం నాగేశ్వరరావుగారు.

"ఏ స్త్రీకైనా పతియే ప్రత్యక్ష దైవం"—
అంటుంది అమ్మ.

భోగి పండుగనాడు అమ్మ మున్ముందుగా నాన్నగారి దగ్గరకు వస్తుంది. వారికి దండవేసి, బొట్టుపెట్టి, అలంకరిస్తుంది. మరి దానిలో ఆశీర్వచనమే ఉందో, అనురాగమే ఉందో, ఆ పాదాలపై భోగిపళ్లు పోస్తున్నది. లోకాని కంతకూ ఆరాధ్యమైన అమ్మ ఆ పాదాలే తనకు ఆరాధ్యమంటుంది.

హైమతో ఆడుకోవటం, హైమను ఆడించటం అమ్మకు సరదా.
అమ్మ నాన్నగారికి భోగిపళ్ళు పోసిం తర్వాత హైమాలయానికి వెళ్తుంది

హైమను నేనే కన్నాను, నేనే పెంచుకున్నాను,
నేనే చంపుకున్నాను, నేనే దైవత్వం ఇచ్చాను-" అని

నిస్సంకోచంగా ప్రకటించిన అమ్మ ప్రతి సంవత్సరం హైమకు భోగిపళ్ళు పోసి. మరింత శక్తినీ, బలాన్నీ ప్రసాదిస్తుందేమో. హైమను అలంకరించి, ప్రేమతో తిలకం దిద్దుతోంది.

అమ్మకు దేవుళ్ళూ బిడ్డలే.
బిడ్డలూ దేవుళ్ళే.

భోగి పండుగనాడు ప్రతి తల్లీ తన బిడ్డకు భోగిపళ్ళు పోసుకొని తన బిడ్డ వెయ్యేళ్ళు సుఖశాంతులతో వర్ధిల్లాలని దీవిస్తుంది. అమ్మ తన బిడ్డలకు భోగిపళ్ళు పోసుకుంటున్నది. అవి భోగిపళ్ళుకాదు- తన అనంత వాత్సల్య రసామృత జలధిలో ఉప్పొంగే కరళ్ళు-మరి వారంతా అమ్మ బిడ్డలా...? అందులో అమ్మ కంటే పెద్దవాళ్ళు న్నారేమిటి!

ఎన్ని కులాల వాళ్ళు
ఎన్ని మతాల వాళ్ళు!
ఎన్ని జాతుల వాళ్ళు!
అక్కడున్న వాళ్ళేనా? యీ ప్రపంచంలో

ఏ మూల ఉన్నవాళ్ళయినా యీ అమ్మకు బిడ్డలేనట.
ఎవరిని చూసినా తన బిడ్డే ననిపిస్తుందట.

తన బిడ్డ యందు ఏమి చూస్తున్నారో
అందరియందూ దాన్ని చూట్టమే బ్రహ్మస్థితిని పొందటం కదా!
అందుకే అమ్మ జగదారాధ్య అయింది.

జగజ్జనని అమృత కరంతో భోగిపళ్ళు పోస్తుంటే - తన్మయులు అవుతున్న ప్రజలు ఎంత అదృష్టవంతులో!

దీ పా వ ళి :

దీపావళీ దివ్య దీపావళీ
ఇది మా పాలి ఆనంద భావావళీ ॥దీపావళీ॥

ప్రిమిదవె ఇలనున్న ప్రతి దేహియూ
ప్రేమించు భావమే అందలి నూనె
వత్తియే జీవిగ వరలగ అన్నిట
వెలిగే జ్యోతివి నీవే సమ్మాన్య ॥దీపావళీ॥
పతితుడు సజ్జను డౌకటే ననీ
పాపము పుణ్యము భువి లేవనీ
అఖిలము నీవై అమ్మవు మాకై
సుగతికి దారిని చూపే తల్లీ ॥దీపావళీ॥
అలరేడు నీ చిరుహాస రేఖలు
తొలగించును మా చీకటి తెరలు
కురయగ నీ కరుణామృత ధారలు
పరవశించు మది మురిసి పోవగా ॥దీపావళీ॥

— B. L. N. ఆచార్య.

## అవధూతేంద్ర సరస్వతీ స్వామీజీ (రఘువరదాసుగారు) :

ప్రస్తుత లోకానికి నామ భిక్ష పెట్టిన మహనీయులు.

భగవన్నామ సంకీర్తనే ఏకైక సాధనగా నిరంతరం గానంచేస్తూ తన్మయు మందే నామయోగి. ఎలుగెత్తి పిలిచి దైవాన్ని ప్రజల మధ్యకు తీసుకురాగలిగిన నాదోపాసకులు. అమ్మసాన్నిధ్యంలో అమ్మను శ్రీరామచంద్రునిగా దర్శిస్తూ పరవశిస్తున్నారు.

## శ్రీ రా మ న వ మి :

నేడు శ్రీరామనవమి. దశరథరాముడై, జానకిరాముడై, కల్యాణ గుణాభిరాముడై, ఆదర్శ పురుషుడై, అవతారమూర్తి అయిన శ్రీరామ చంద్రుని జన్మదినము – కళ్యాణ దినమూ. ఆ అవతారమూర్తికి జరిపే అర్చన నందుకునేందుకు సర్వ దేవ దేవీ స్వరూపిణి అయిన అమ్మ నా దంపతులు సభక్తికంగా ఆవాహన చేస్తున్నారు.

కోదండరాముడే కోటిసూర్యప్రభలతో కోమలి రూపు ధరించి వచ్చాడా అన్నట్లు జగదభిరామమైన అమ్మ పూజావేదికనలంకరిస్తోంది.

పాట : అంతా రామ మయం
ఈ జగమంతా రామ మయం
అంతరంగమున ఆత్మారాముడనంత రూపముల
వింతలు సలుపగ ॥అంతా॥
సోమసూర్యులును సురలు తారకలు
ఆమహావిభుడును అవని జనించెను ॥అంతా॥
అండాండంబులు పిండాండంబులు
బ్రహ్మాండంబును రంజిల ఒకటిగా ॥అంతా॥
నదులు వనంబులు నానామృగములు
రామా రామా రామా రామా రామా ॥నదులు॥
హింసా కాండములు వేదశాస్త్రములు
అష్ట దిక్కులను ఆదిశేషుడును
అష్ట వసువులును అరిషడ్వర్గను ॥అంతా॥
- భక్త రామదాసు

## వైకుంఠ ఏకాదశి :

ప్రతి సంవత్సరం వైకుంఠ ఏకాదశి నాడు తెల్లవారు జామున కారుణ్యమూర్తియై, కైవల్య దాత్రియై సాక్షాత్ శ్రీ మన్నారాయణ స్వరూపంతో అమ్మ సర్వజనులకు దర్శనమిస్తుంది.

తృప్తే ముక్తి గదా. ఆ తృప్తి సర్వహృదయాలనూ ఆక్రమించుకుని సకలవైకల్యాలను పరిహరించి పరమానందాన్ని ప్రసాదిస్తుంది. ప్రత్యక్షమైన చక్రహస్తునికి చక్రపొంగలి నివేదన చేస్తున్నారు.

కీర్తన :-

పుణ్యా మహో పుణ్యా మహో
పుణ్యం తవ దర్శనం - ధన్యతమం - ధన్య తమం
మాతః మమ జీవనం ॥పుణ్యామహో॥
హ్రైం - క్లీం - హ్రీం - శ్రీం - ఓం శ్రీ చక్రాధీశ్వర్యై నమః
హ్రైం-క్లీం-హ్రీం - శ్రీం - ఓం శ్రీమత్ అర్కపురీశ్వర్యై నమః
హ్రైం-క్లీం-హ్రీం-శ్రీం-ఓం చరాచర జగన్మూర్త్యై నమః

హైం-క్లీం-హ్రీం-శ్రీం-ఓం అనసూయాదైవ్యైనమః
హైం-క్లీం-హ్రీం-శ్రీం-ఓం జగన్మాతే్రనమః
మాయా మానుష యోషా - మహిత వేషధారీ - సన్
శ్రీ మన్నారాయణోధ్య - సాక్షాత్ సందృష్టోత్రా
॥పుణ్యమహో॥
హైం-క్లీం-హ్రీం-శ్రీం-ఓం విశ్వవ్యాప్త పదద్వయాదైవ్యైనమః
హైం-క్లీం-హ్రీం-శ్రీం-ఓం వేదవేదాంత సంవేద్యాయైనమః
హైం-క్లీం-హ్రీం-శ్రీం-ఓం కేవలాద్వైత సంసిద్ధాయైనమః
హైం-క్లీం-హ్రీం-శ్రీం-ఓం బ్రహ్మానందైకసామ్రాజ్ఞయైనమః
నేయమంబ పర్ణకుటీ - కేవల వైకుంఠనగరీ
శ్రీనారాయణనిలయః సాక్షాత్ సందృష్టోత్రా ॥పుణ్యమహో॥
హైం-క్లీం-హ్రీం-శ్రీం-ఓం జగన్మోహిని మోహిన్యై నమః
హైం-క్లీం-హ్రీం-శ్రీం-ఓం మందగమనాయై నమః
హైం-క్లీం-హ్రీం-శ్రీం-ఓం మహాలక్ష్మ్యైనమః
హైం-క్లీం-హ్రీం-శ్రీం-ఓం హిరణ్య గర్భ జనన్యై నమః
హైం-క్లీం-హ్రీం-శ్రీం-ఓం రాధానాధ స్వరూపిణ్య నమః
నేమే సామాన్య జనాః దేవతా మహర్షయశ్చ
నయనోత్సవ సౌభాగ్యం సాక్షాత్ సందృష్టమిదమ్
॥పుణ్యమహో
—డా॥ పన్నాల రాధాకృష్ణ శర్మ.

ఒక్కసారి ఆ పాదాలను పట్టుకోగలిగితే
ఎక్కడా దొరకని తృప్తి, ఎల్లలులేని శాంతి దొరుకుతాయి.
అందుకే ఆ పాద స్పర్శ కోసం ఎవరికైనా అంత తపన.
ఆ చరణ సాన్నిధ్యంలో.... ఆ చక్కని నేత్రాల నుండి
జాలువారే చల్లని చూపుల వెన్నెల్లో తడిసిన మనిషికి
ప్రపంచాధిపత్యమైనా తృణప్రాయమే.

## అమ్మకు పూజ:

రోజూ ఎందరో అమ్మను పూజ చేసుకుంటారు. పూజ అంటే అమ్మ అభిప్రాయం- తన యావచ్ఛక్తిని దైవానికి అర్పించడమేనని-

కానీ ఎవరెట్లా పూజ చేసుకుంటామన్నా అమ్మ ఒప్పుకుంటుంది. వాళ్ళు పూజ చేసుకుంటుంటే మాత్రం ఆ పూజ తనకు అనుకోదు- ఆ భావం అమ్మలో ఎక్కడా కనుపించదు.

ఒకసారి అమ్మ అంది, "మీరు పూజ చేస్తున్నారంటే అది నా కనా? ఏ పార్వతి అనో, లక్ష్మి అనో, సరస్వతి అనో భావించుకుని చేసుకుంటారు" అని. ఒకరు "మీరు నా ఇష్ట దైవంగా దర్శనం ఇచ్చారమ్మా" అంటే, "మీ ఇష్ట దైవమే నా రూపంలో సాక్షాత్కరించిందేమో"- అని చెప్పింది. అందుకే పూజా సమయాల్లో అమ్మ తనకేమీ పట్టనట్లు తన ఆలోచనలో తన పనిలో నిమగ్నమైఉంటుంది. ఒక్కొక్కసారి తానూ ఆ పూలను తీసుకుని తన పాదాలను తానే పూజించుకుంటూ వుంటుంది.

దైవం తానే ...
భక్తుడు తానే....
పూజ తానే....
పూలు తానే.... సర్వం తానైన తల్లి.

## అమ్మ సందేశం:

ఈ కనుపించేదంతా అదే అనుకుంటున్నప్పుడు.... ఈ గుళ్ళూ, గుడిసెలూ, చెట్లూ, చేమలూ, కాయలూ, పండ్లూ, పూలూ పరిమళాలూ.... ప్రత్యేకించి దైవాన్ని ఏది ఎక్కడ అని వివరించ మంటావు, నాన్నా!

.... ఈ జగత్ సర్వం నీకు కనిపించేదీ, కనిపించనిదీ అంతా పరబ్రహ్మ స్వరూపమే. దీన్ని సమిష్టిగా చెప్పుకుంటే పరబ్రహ్మమూ అన్నారు. విడి విడిగా చెప్పుకునేటప్పుడు యిన్ని పేర్లతో పిలుస్తున్నాము- అంతే, నాన్నా!

.... ఈ సృష్టిని భగవంతుడు సృష్టించటం కాదు, నాన్నా! ఈ సృష్టే భగవంతుడు.

.... కనుకనే ఈ సృష్టిలో దేన్ని చూసినా నాకు ఒకటిగానే ఉంటుంది. ఉన్నదంతా సాక్షాత్తూ దైవం కాబట్టే దేనిని చూసినా,

దేనిని తాకినా, దేనిని విన్నా, దేనిని ఆలోచించినా ఎంతో ఆనందంగా ఉంటుంది.

.... ఆనందం అంటే భగవంతుని గుర్తించటమేగా.
అనుభవం అన్నా అదే - -
విశాగ్రత అన్నా అదే - -
సమాధి అన్నా అదే - -

ఎంత వెదికినా అది కానిది నాకు కనిపించటం లేదు, నాన్నా!

## అట్లతద్దె పండగ :

అమ్మ ఉయ్యాల ఊగుతుంది.
అమ్మకు ఈ జగత్తే తూగుటుయ్యాల.
కష్టసుఖాలు కలిసిన జీవితమే రసహేల.

అమ్మ ఒకసారి అంది, "కష్టసుఖాలు ఎవరికైనా తప్పవు.

కానీ నవ్వుతూ అనుభవించేవాడి దగ్గరకు ఏడుస్తూ అనుభవించేవాడు సలహాకు వస్తాడట. అట్లాగే అమ్మ వద్దకు అనేకులు చేరారు. అమ్మ అందరినీ ఎంతో ఆదరిస్తూ, వాళ్ల యోగక్షేమాలు విచారిస్తూ వాళ్ళతో ఆడుకుంటుంది. తాను లోకంతో ఆడుకుంటుందట, కానీ లోకం అమ్మతో ఆడుకోదట.

అమ్మ ఎవ్వరినీ మంత్రానుష్ఠానం చెయ్యమని ఆదేశించదు. యోగం అభ్యసించమని సలహా ఇవ్వదు. కళ్ళు మూసుకు జపమాల త్రిప్పుతూ కూర్చోమని చెప్పదు. "కనుపించే దంతా పరమాత్మ స్వరూపమే అయినప్పుడు ఇంకా కళ్లు మూసుకోట మెందుకూ" అంది అమ్మ. అయితే యిక్కడ అందరూ సోమరులవలే ఉంటారా అంటే, కాదు- ఎవరికి తగిన పని వారికుంది.
ఎవరేం చేసినా అంతా ఒకటే నంటుంది అమ్మ.

## అద్వైతమూర్తి - అమ్మ :

అమ్మ దృష్టిలో దేవాలయంలో అభిషేకం చేసేవాడు, పాకీ దొడ్డు కడిగేవాడు ఒక్కటే. అమ్మకు ప్రాపంచికమనీ, పారమార్థికమనీ

రెండు లేవు, ఎవరేం చేసినా అంతా దైవారాధనే - అంటుంది అద్వైతమూర్తి అమ్మ.

అందుకనే జిల్లెళ్ళమూడిలో అమ్మ సన్నిధి లోకాన్ని, జీవితాన్ని, వేదాంతాన్ని అధ్యయనం చేయదలచుకున్న వాళ్ళకి అనువైన పాఠశాల. కష్టసుఖాలు రెంటినీ అమ్మ ఇచ్చిన వరప్రసాదాలనుకుంటూ ఏ ఒడిదుడుకులూ లేకుండా అనుభవించే సమచిత్తమే అమ్మ వెన్నతో పెట్టే విద్య. "యీ కనిపించేదంతా దైవమే-కనుకనే లోకం ఇంత ఆనందంగానూ, ఆనందప్రదంగానూ వుంది"- అని అమ్మ అనుక్షణం ప్రబోధిస్తుంటుంది.

అమ్మ బోధలర్థంచేసుకుంటే ఎవరికీ సృష్టిలో ఏ వస్తువును నిరసించాల్సిన అవసరం, ఏ వ్యక్తినీ నిందించాల్సిన అవసరం ఉండదు.

"ఎవరేపని చేసినా అందుకు వాళ్ళు ఎవరూ కర్తలు కారు. అందరి పనులకు ప్రేరణ ఒక్కరిదే"- అని చెబుతూ సర్వ సమానత్వాన్ని చాటుతుంది. అందువల్లనే ఇక్కడి వాతావరణం రసమయమై చైతన్య తరంగితమై, ఆనంద పరిపూర్ణమై, తేజోవంతమై, ఆహ్లాదకరమై నిత్యకల్యాణమై, పచ్చతోరణమై విరాజిల్లుతుంటుంది.

వేదాంత నిగూఢ రహస్యాలు ఇక్కడ సహజమై శ్రావ్యమై వినిపిస్తూంటాయి.

ఇహ పరాలకు ఒక పసిడి వంతెన ఇంద్ర ధనస్సువలె నిరంతరం కనిపిస్తూ వుంటుంది.

తత్వ జలధి లోతుల్లోగానీ లభ్యం కాని అమూల్య రత్నాలతో ఇక్కడి బాల బాలికలు విలాసంగా వినోదంగా ఆడుకుంటూ వుంటారు. అందుకనే ఇక్కడి వాళ్ళకి లోకం ముళ్ళపొద కాదు. పూ పొదరిల్లు. కాలం కాలనాగు కాదు, కర్పూర నీరాజనం.

## ఆంగ్ల సంవత్సరాది:

కాల స్వరూపిణి అమ్మ. నూతన సంవత్సరంలో శుభాలు పొందాలనే కోరికలే అందరి కళ్ళల్లోని మిలమిలలు. ఔను. మానవుడు

ఆశాజీవి. గడిచిన సంవత్సరం గడియలు మూసి, క్రొత్త సంవత్సరం తలుపులు తెరుస్తోంది.

ఆశలను ఫలింపచేసే వసంతమూ అమ్మే.
ఆశల ఆకులను రాల్చివేసే హేమంతమూ అమ్మే.

పాట : కనుగొంటినా లేక కలగంటినా ॥కను॥
కనులు మూసికొంటినా కనులు తెరచియుంటినా ॥కను॥

క్రీసును కన్నాను - మా ఏసనుకున్నాను
దైన్ ఈజ్ ది కింగ్ డం - ది పవర్ అండ్ ది గ్లోరీ
ఫర్ ఎవర్ అండ్ ఎవర్... ఆమెన్ ॥క్రీసును॥
అవును మరి అమ్మ - అక్షరాల మరియమ్మ
నారి కాదు మేరి - నా తల్లికి సరి ఏరి ॥కను॥
అలా నేను చూశా - అల్లా అని కేకేశా
మోజుతీర చూశా - నా మోజుతీర చూశా
నమాజుకూడ చేశా
అల్లాహో అక్బర్ - అల్లాహో అక్బర్
అష్హద్ అల్లాహ్ - ఇల్లహా - ఇల్లల్లాహ ॥అలానే॥
అమ్మే అల్లారా-నేచూశా కళ్ళారా-నేచూశా కళ్ళారా ॥కను॥
చంద్రిముఖి అనుకొంటిని - చతుర్ముఖుని కనుగొంటిని
భ్రిమను వీడి చూశా - ఆ బ్రిహ్మయే మన అమ్మ
అమ్మ కాదు బ్రిహ్మ పరబ్రహ్మయే మన అమ్మ
సర్వం ఖల్విదం బ్రిహ్మ
అమ్మ కాదు బ్రిహ్మ పరబ్రిహ్మయే మన అమ్మ ॥కను॥

—నదీరా

మతం :

కొందరు సోదరులు అమ్మకు కేకును నివేదన చేస్తున్నారు. అమ్మ కేకును కోస్తున్నది. క్రొత్త సంవత్సరం మొదటి రోజున కేకును కోయటం

పడమటి దేశాల సంప్రదాయం, ఒకరు అమ్మను
"మీరు హిందూమత సంప్రదాయాన్ని పాటిస్తారా"
అని అడిగారు.

"ప్రత్యేకించి ఏ సంప్రదాయాన్నీ నేను పాటించను, నాన్నా" అంటూ ... "సర్వ సమ్మతమైనదే నా మతం" అని ప్రకటించింది. అన్ని మతాలకు మార్గాలకు అమ్మ సమానమైన విలువనే ఇస్తుంది. ఆచరించేవాడికి ఏ మతమైనా ఒకటేనని అమ్మ అభిప్రాయం. ప్రతి మనిషికీ ఏదో ఒక మతం అవసరమనికూడా అమ్మ అంగీకరించదు.

వివిధ వర్ణకిమ్మీరమైన రమణీయ ప్రకృతి సాంగత్యంలో నిఖిల రసామృతమూర్తి అయిన మానవుడే సులభంగా పరిపూర్ణతని పొందగలడని అమ్మ సందేశం.

కనుకనే మతాన్ని ఉద్ధరించటంకోసం కాక మనిషిని ఉద్ధరించటం కోసమే అమ్మ అవతారమని పలువురు పరిశోధకులు నిర్ణయించారు.

## అమ్మ ఆవిర్భావం :

మన్నవ గ్రామం, అమ్మ పుట్టిన ఊరు....గుంటూరు జిల్లా బాపట్ల తాలూకాలో ఉంది. ది 28-3-1923 వ తేదీన అంటే రుధిరోద్గారి చైత్ర శుద్ధ ఏకాదశినాడు తెల్లవారుఝామున అమ్మ ఆవిర్భవించింది.

తండ్రి ఆ ఊరి కరణంగారు, శ్రీ మన్నవ సీతాపతి. తల్లి రంగమ్మ. ఆ సంవత్సరమే ఆ ఊరిలో రాజ్యలక్ష్మి అమ్మవారి దేవాలయంలో శ్రీ రాజరాజేశ్వరి యంత్రం ప్రతిష్ఠించారు. అమ్మ పుట్టినప్పుడు అనేక దివ్య దర్శనాలు కనిపించినయ్ .. అందువల్ల సాక్షాత్తు రాజరాజేశ్వరే అమ్మగా అవతరించిందని ఆ ఊరివాళ్ళు అనుకున్నారు. తర్వాత పలువురు పండితులు దానిని బలపరిచారు.

....బాపట్లలో చిదంబరరావు తాతగారి ఇల్లు. అమ్మ చిన్నతనం ఎక్కువగా యిక్కడనే గడిచింది.

## ఉపదేశం:

5-5-1973—అమ్మ తన రెండవ కుమారుడు రవికి ఉపనయనం చేస్తోంది. రవితోపాటు మరికొందరు తమ ఉపనయనాలు అమ్మచేత చేయించుకుంటున్నారు. అమ్మద్వారా ఉపదేశం పొందేందుకూ మంచి అవకాశం ఈ ఉపనయనం మాత్రమే అందరి మత సంప్రదాయాలనూ అమ్మ సమ్మతిస్తుంది. కనుక ఈ పవిత్ర సమయంలో మాత్రమే వటువులకు మంత్రోపదేశం చేస్తుంది.

అమ్మ మామూలుగా ఉపదేశం చేయదు.
ఎవ్వరికీ ఏ మంత్రం చెప్పదు.

ఉపదేశమంటే - భగవంతుని సన్నిధికి చేర్చటమనికదా!

అందరిలోనూ దైవత్వాన్నే చూసే అమ్మకు ఎవరికైనా ఉపదేశం చేయాల్సిన అవసరమేం కనిపిస్తుంది! మంత్రం విషయంలో కూడా అమ్మ అభిప్రాయాలు విలక్షణంగా ఉంటాయి.

మంత్రమంటూ ప్రత్యేకంగా ఏమీలేదు. మనస్సే మంత్రమంటుంది అమ్మ. ఏ మాటలైనా మననంతో మంత్రాలవుతాయని అమ్మ అభిప్రాయం; మనస్సిద్ధి ఉంటే మాటలన్నీ మంత్రాలేనట. మన మనస్సుయొక్క శక్తినే మననంద్వారా మాటలకు యిస్తామట. దానిని మరచి ఆ శక్తి మాటలదేనని భ్రమిస్తామట. అందుకనే అమ్మకు అన్ని అక్షరాలూ శక్తిగలవే. అన్ని మాటలూ మంత్రాలే. అమ్మకు పసిపిల్లల ఏడుపులోనూ వేదమే వినిపిస్తుందట. రాతిపై రాతితో కొట్టినా, ప్రణవనాదమే వినవస్తుందట.

అమ్మ భిక్ష పెడుతోంది. మన జీవితం, జీవనం అన్నీ అమ్మ భిక్షే.

రాఘవరావు మామయ్య - అమ్మకు అన్నగారు రవి ఉపనయం సందర్భంగా మామయ్యకు అమ్మ క్రొత్త బట్టలు పెట్టి ఆశీర్వదిస్తోంది. అమ్మ బంధువులందరూ అమ్మకంటె వయస్సులో పెద్దవారే అయినా

చివరకు తండ్రి, తాతలూ అన్నలూ అత్తగారు అందరూ అమ్మను అర్చించుకుని అమ్మనుండి ఆశీర్వచనం పొందటం విశేషం.

## గృహస్థాశ్రమం :

ఈ రోజునే రవి పెండ్లి - వధువు వైదేహి. అమ్మ ఆ ఇద్దరినీ పెండ్లికొడుకునూ, పెండ్లికూతురును చేస్తోంది. అక్కడ అనేకులు పెండ్లి చేసుకుంటారు ఈ ఘట్టాన్ని అమ్మ స్వయంగా వైభవోపేతంగా జరుపుతుంది, పెండ్లంటేనే అమ్మకెంతో ఇష్టం. కారణం-కల్యాణం గృహస్థాశ్రమానికి సింహద్వారం కావటమే.

గృహస్థాశ్రమంపై అమ్మకు అమానం మెండు. సన్యాసంలో ఉండి పరమార్థాన్ని సాధించటం కోట విడిచి యుద్ధం చేయటమట. గృహస్థుగా ఉండి సాధించటం కోటలో ఉండి యుద్ధం చేయటమట. చేసే ప్రతి పని దైవసేవే అనుకోగలిగితే ఆధ్యాత్మిక సాధనకు సంసారం ప్రతిబంధంకం కాదని ఘంటాపథంగా చెప్పింది అమ్మ. తన పెళ్ళికి ముందు ఒకరు 'నీకీ పెళ్ళి ఎందుకమ్మా' - అని ప్రశ్నించారు. పెళ్ళిలో పెద్దపులి ఉందని భయపడేవారి భయం పోగొట్టటానికే - అని సమాధానం చెప్పింది. శాస్త్రాలు సంసారం బంధహేతువని దానిని వదిలివేయాలని ఘోషిస్తున్నాయి.

సంసారమంటే భార్యాబిడ్డలు కాదు: 'సంకల్పమే సంసారం' అని క్రొత్త నిర్వచనం ఇచ్చింది అమ్మ. సంకల్పరాహిత్యం అంటే సంకల్పాలు లేకపోవటం కాదట. తనకు వచ్చే ప్రతి సంకల్పం దైవం యిచ్చిందేనని నమ్మటం.

చీపురు, పొయ్యి, కత్తిపీట, రోలు-రోకలి తనకు నాలుగు వేదాలట. చేట పంచమ వేదం. పతియే దైవమట. "ఒకరు నీ సాధన ఏమిటమ్మా" అని అడిగారు. "బిడ్డల్ని కనటమే" అన్నది అమ్మ. ఎంత ధైర్యంగా చెప్పింది. తానే తిరిగి ఆ సూత్రాన్ని వివరించింది. 'బిడ్డల్ని కనటమంటే-ప్రపంచంలోని అందరినీ తన బిడ్డలుగా కనటమట అందరినీ బిడ్డలుగా ఎవరు చూడగలరు ? ఎవరు ప్రేమించగలరు ?

ఆ అనంత వాత్సల్యం,
అకారణ కారుణ్యం,
సర్వతాత్రిసురాగం అమ్మకు మాత్రమే సాధ్యం.
అందుకే అమ్మ "అందరికీ అమ్మ" అయింది.
మరి పరిమిత మమకారం మానవత్వం....
పరిధులు దాటిన మమకారం మాధవత్వం కదా!

## భార్యా భర్తలు :

రవి వివాహ సందర్భంలో స్నాతకోత్సవం జరుగుతోంది. అమ్మ నాన్నగారితో కలిసి పీటలపై కూర్చుని రవికేగాక అక్కడున్న అందరికీ కనువిందునూ, ఆనందాన్నీ కలిగించింది. అమ్మ రవి పెండ్లిని స్వయంగా జరిపిస్తోంది.

పెనిమిటి అంటే పెన్నిధి - ఆ పెన్నిధి అండన చేరటమే పెండ్లి. ఆ అండను పొందే పరిణామమే పరిణయం.

కళంకరహితంగా మనస్సును మరొకరికి అర్పణ చేయటమే కల్యాణం. అన్నీ అనుభవిస్తూ అన్నీ విడిచిపెట్టేదే వివాహం.

విభిన్న ప్రవృత్తులు రెండు కలిసి ఉండటమే కాపురం.
భావం తెలుసుకు ప్రవర్తించేదే భార్య.
బాధ్యత తీసుకు ప్రవర్తించేవాడు భర్త.
భార్యకు భర్తకు దేవత.
భర్త భార్యకు దేవుడు.

మంగళసూత్రమంటే భర్త రెండు పాదాలు. స్త్రీకి ఏ సూత్రం తెలుసుకోటానికయినా ఆధారం మంగళసూత్రమేనట. అమ్మ రోజూ తన మెడలోని మంగళసూత్రాలను కడిగి, పూజించి, ఆ తీర్థాన్ని తీసుకుంటుంది. ఆ తీర్థం తీసుకున్నందువల్లనే ఇతరులకు తీర్థంవేసే అర్హత తనకు వచ్చిందట.

అమ్మ తన నిత్యజీవితంలో పూజ అంటూ చేస్తే ఈ సందర్భం ఒక్కటి మాత్రమే కన్పిస్తుంది. అయా సందర్భాలను పురస్కరించుకొని అమ్మ స్త్రీలకు మహత్తర సందేశం ఇచ్చింది.

"భర్త ఎట్లాంటివాడైనాసరే, ఆయన సేవ చెయ్యటమే భార్య ధర్మమట. భర్త ఏ దారినబోతే ఆమెకూడా ఆ దారిన బోవటమే కర్తవ్యమట.

....పతివ్రితకు భర్త కాలి బూట్లలో మట్టికూడా పవిత్రింగానే కనిపిస్తుందట. ఆ శబ్దంలో మంత్రిమే వినిపిస్తుందని వివరిస్తూ....పాతివ్రిత్యానికి చరమదశను చెప్పింది....అప్పుడు భర్తకూడా భార్యను అమ్మా అని పిలుస్తాడట. పతివ్రిత అంటే పతిని ఆధారంగా చేసుకుని పంచ భూతాలను జయించినదట.

సాధ్వి అంటే సర్వాన్ని స్వాధీనం చేసుకున్నదట.

కూతురిని కోడలిని సమానంగా చూట్టమే గృహిణికి అద్వైత సాధనట. ఎవరికి ఏం చెప్పినా అమ్మ తన అనుభవంనుండే చెబుతుంది. తాను నడిచిన దారినే బిడ్డలకు వివరిస్తుంది.

## అమ్మ కళ్యాణం :

అమ్మ కళ్యాణం ది 5-5-1936 తేదీన జరిగింది. అమ్మ కళ్యాణం అంటే అఖిలజగత్తుకు కళ్యాణమేకదా! కనుకనే ఆ పవిత్రి దినాన, ప్రితి ఏడూ జిల్లెళ్ళమూడిలో ఒక మహోత్సవం జరుగుతుంది. ప్రితి సంవత్సరం ఆ దినం జిల్లెళ్ళమూడి చరిత్రిలో ఒక నూతనాధ్యాయాన్ని సృజిస్తుంది. అంతవరకూ ఆలయమేలేని జిల్లెళ్ళమూడిలో ది 5-5-1956 తేదీన అందుకు శంకుస్థాపన చేసింది. అప్పటినుండి ప్రితి మే 5వ తేదీన ఏదో ఒక విశిష్ట కార్యక్రమంతో ఆ దేవాలయానికి బలం చేకూరుస్తూనే ఉంది.

ప్రితి సంవత్సరం ఆనాటి ఉదయం 6 గంటలకు దేవాలయం పై భాగం నుండి లోక మోహనమూ, సర్వ శుభప్రిదమూ, ఆనంద దాయకమూ అయిన దివ్యదర్శనం ప్రిసాదిస్తుంది. శుభాశుభాలూ, ఖేద మోదాలు, జయాపజయాలూ, మానావమానాలూ, సర్వ ద్వంద్వాలూ అమ్మకు సమానమే. అయినా తన అనుంగు బిడ్డలకు ఇష్టంకాని కష్టాలు, అశుభాలు, అపజయాలు, అవమానాలు తొలగించటానికి

అన్నట్లు వందలాది గుమ్మడికాయలు, కొబ్బరికాయలు పగులకొడు తుంది అమ్మ. ప్రతివాడికి సుఖము, ఆనందము, శుభము, జయము అందిస్తున్నదా అన్నట్లు పసుపుకుంకాలు వెదజల్లుతోంది. అవనిపై మానవులు, ఆకాశంనుండి దైవం పసుపుకుంకాలతోపాటు అమ్మ కన్నుల కాంతులు కలిసి రాగరంజిత మేఘాలై ప్రతి హృదయంలోనూ ఆనందామృతాన్ని కురిపిస్తున్నాయి.

మానవుల నేత్రాలనుండి తొంగిచూసే కన్నెపిల్లలవంటి కోరికలు,
దైవం సుందరనయనాలనుండి అనురాగజ్యోత్స్నా తరంగమాలికలు
దైవం దరికి చేరాలని మానవుడి వేదన,
మానవుణ్ణి పైకి చేదాలని దైవం కామన;
అదొక మధుర సన్నివేశం. మానవుడు దేవుడు పరస్పర
అవలోకనంలో పరవశించిపోయిన పునీత సమయం.

గడ్డాలు పెరిగినవారయినా అమ్మ దృష్టిలో పసిబిడ్డలే. అయి నప్పటికీ చిన్నపిల్లలంటే అమ్మకు చాలా ఇష్టం. వాళ్ళకు కావలసినవి చూస్తూ వాళ్ళతో ఆడుకోవటం అమ్మకు పరమ సంతోషం. అమ్మ అన్నది - అడగటం చేతనయినవాళ్ళకి వారడిగిందే పెడుతుందట. అడగటం చేతకానివాళ్ళకి, ఏం కావాలో తానే కనుక్కొని పెడుతుం దట. సికిందరాబాద్‌నుంచి వచ్చిన ఆ పిల్లకు చీర కడుతూ ఆ క్రొత్త అనుభవంతో ఆ పిల్ల పడే సిగ్గులోనూ, ఆ తల్లిదండ్రులు పొందే తన్మ యత్వంలోనూ అమ్మకూడా పాలుపంచుకుంటున్నది.

## మాతృశ్రీ అధ్యయన పరిషత్తులు :

అమ్మను గురించి, అమ్మ సందేశాన్ని గురించి అధ్యయనం చేయటానికి జనబాహుళ్యానికి అందజేయటానికి పలు పట్టణాల్లో పనిచేస్తున్న సంస్థలు Matrusri Study Circles. అందులో ఒకటి గూంటూరు శాఖ. ఆనాటి సభలో డాక్టర్ ప్రసాదరాయ కులపతి, శ్రీ జమ్మలమడక మాధవరామ శర్మ, శ్రీ రాగం ఆంజనేయులు, శ్రీ పి. యస్. ఆర్. ఆంజనేయులు గారు ప్రసంగించారు.

మాతృశ్రీ అధ్యయన పరిషత్తులలో నెల్లూరు శాఖ ఒకటి. ఆ శాఖ నిర్వహించిన ఒక సభలో ప్రముఖ వైద్యులు డాక్టర్ ఎస్. వి. సుబ్బారావు మహిమాన్వితమైన అమ్మ వైద్యశాస్త్ర వైదుష్యాన్ని వివరించారు. నెల్లూరులో అధ్యయన పరిషత్తు ఆధ్వర్యాన ఉచిత వైద్యశాల నిర్వహింప బడుతోంది. వారానికొకసారి పేదలందరికీ వైద్యసలహాతోపాటు మందులను కూడా ఉచితంగా ఇస్తున్నారు. అనేకులు చికిత్సద్వారా అమ్మ అనుగ్రహానికి పాత్రులై రోగనివారణను పొంది ఆరోగ్య వంతులవుతున్నారు.

## హైదరాబాదులో AMMA HUMANITARIAN MISSION.

హైదరాబాదు నగరం. ఆంధ్రప్రదేశ్ రాజధాని. అమ్మ విశ్వ జనీన సందేశాన్ని అందుకని అక్కడి సోదరులు Amma Humanitarian Mission నెలకొల్పుకున్నారు. మిషన్ అధ్యక్షులు శ్రీ రాజ గోపాలాచారి అమ్మను పుష్పమాలతో అలంకరించారు. ఆ మిషన్‌కు అమ్మ తన అమృత హస్తంతో ప్రారంభోత్సవం చేస్తోంది.

పేదలందరికీ ఉచితవైద్యం విద్య అందిస్తూ, అవిటివారికి ఆధార మేలేని వారికి భోజనాది వసతులు కల్పిస్తూ విశ్వ జనీనమైన ఒక ఆశ్రయాన్ని ఏర్పరచటం ద్వారా విశ్వజనని సేవచేసుకోవాలనే తమ పవిత్రాశయాన్ని వ్యక్తం చేస్తున్నారు, అధ్యక్షులు.

డాక్టర్ శ్రీపాద గోపాల కృష్ణమూర్తి,
శ్రీ వీరమాచనేని ప్రసాదరావు గార్లు.......

ప్రసంగిస్తారని చెబుతున్నారు - ఉపాధ్యక్షులు శ్రీ ఆర్. శంకరరెడ్డి.

## శ్రీ విశ్వజననీ పరిషత్ :

తన అవతరణకు కారణం లేదని,
తనకొక ప్రత్యేక కార్యక్రమం లేదని,
తాను ఏ మహత్తర ఆదర్శాన్నీ ప్రబోధించటం
లేదనీ అమ్మ పదే పదే చెబుతోంది. అది అమ్మ
నిరాడంబరత్వాన్ని మాత్రమే తెలియ చేస్తుంది.

అమ్మ ప్రతి చర్య ఒక మహత్తర ఆదర్శం.
అమ్మ ప్రతి మాట మహోదాత్త సూక్తి.
అమ్మ సందేశాన్ని ఆదేశాన్ని కార్యాచరణలోకి పెట్టటం కోసం విశ్వజననీ పరిషత్ రూపొందించబడింది. దాని కొక కార్యవర్గం ఏర్పడింది. కార్యవర్గ సమావేశం జరుగుతోంది.

"సమావేశం అంటే సమమైన ఆవేశం కలదట" - అని అమ్మ అంది.

## మాతృశ్రీ స్వర్ణోత్సవాలు :

ది 12-4-1973 తేదీన అమ్మకు ఏభై వసంతాలు నిండిన సందర్భంగా స్వర్ణోత్సవం జరుగుతోంది. అది జగత్ చరిత్రలోనే అపూర్వ సంఘటన. ఎవ్వరూ ఎక్కడా ఎప్పుడూ కనీవినీ ఎరుగని మహోత్సవం. ఏ భేదాలూ లేకుండా - లక్షమందికి పైన ఒక్క పంక్తిని కూర్చుని భోజనం చేసిన అత్యద్భుత సన్నివేశం; మానవాతీతమైన మహత్కార్యం.

అమ్మ అనంత శక్తికి ప్రత్యక్ష నిదర్శనం.
అమ్మ జన్మించిన క్షణం నుండే కాక పుట్టక పూర్వం నుండే అనేక అద్భుతాలను కనబరిచింది; అవతార మూర్తి ఆవిర్భవించ బోతున్నదని సూచించింది; చిన్నతనంలోనే అలౌకిక మహిమలను ప్రకటించింది: అనేక విధాల తన జగన్మాతృత్వాన్ని స్పష్టపరిచింది. ఒకసారి తన నాల్గవ ఏటనే తన తల్లితో .... "నీవు లేక పోతే, నేనే అమ్మనై ఉంటాగా" అంది. బాల్యం నుండి అనంత - వాత్సల్యాన్ని, అవ్యాజ ప్రేమను అందరిపై కురిపిస్తూనే ఉంది. తనను కీర్తించినవాళ్ళని, ద్వేషించినవాళ్ళని, హింసించినవాళ్ళని, అవమానించినవాళ్ళని ప్రతిఒక్కరిని "వాడూ నా బిడ్డేగా" అనుకుంటూ అందరిని సమానంగా ప్రేమిస్తోంది.

ఆ ప్రేమమూర్తికి బిడ్డలందరూ కలిసి స్వర్ణోత్సవం చేయాలనుకున్నారు. ఏం చేయమ టావని అమ్మను సలహా అడిగారు. ఒక్క లక్ష

మంది ఒకే పంక్తిన భోజనం చేయాలట; ఆ మనోహర దృశ్యం తాను చూడాలట; తన కోరికను వ్యక్తం చేసింది. అదే ఆదేశంగా కార్య క్రమం మొదలైంది. అందుకుగాను 70 ఎకరాల మాగాణిపొలం బాగు చేయించారు. ఇవన్నీ ఆ భూమిలో వేసిన చల్లని పందిళ్ళు. చక్కని పామియానాలు సువాసనలు వెదజల్లుతూ కనువిందు చేస్తున్నాయి.

లక్ష మంది భోజనం చేయాలంటే ఆ వంటగ్గానీ, జనం తాగ్రేం దుకుగ్గానీ, ఇతర అవసరాలగ్గానీ ఎంత నీరు కావాలి? ఆ గ్రామంలోగల ఒకే ఒక్క చెరువు నుండి దానికి అరమైలు దూరంలో ఉన్న పందిళ్ళకు నీటిని సరఫరా చేయాలి. ఈ బృహత్తర కార్యక్రిమాన్ని సమర్థంగాను జయప్రదంగాను నిర్వహించిన గుంటూరు జిల్లాపరిషత్ ఇంజనీరింగ్ శాఖ బహుధా ప్రశంసనీయమైంది.

లక్ష మంది ఒకే పంక్తిన భోజనం చేస్తారంటే, యీ అపూర్వ దృశ్యాన్ని చూడాలనే కోరికతో మరో లక్ష మంది వచ్చారు. యీ ప్రజా సముద్రాన్ని అదుపులో ఉంచటానికి ఎంత బలగం కావాలి! అన్ని విద్యాలయాల నుండి 1000 మందికిపైగా బాల భటులు; అనేక పట్టణాల నుండి స్వచ్ఛంద సేవకులు ఆ మహోత్సవంలో పాల్గొని అమ్మ కృపకు పాత్రులైనారు.

పోలీసు సిబ్బంది ఎంతో జాగ్రత్తగానూ, కడు నేర్పుగాను వ్యవహరించి ఏ ప్రమాదాలూ కలగకుండా తమ బాధ్యతను నిర్వ హించి అమ్మ అనుగ్రహం పొందారు.

మహా ప్రజానీకానికి అనేక వసతులు కల్పించారు. వాటి వివ రాలు జనానికి అందించాలికదా! అందుకే ఈ విచారణ కార్యాలయం. ఈ మహా సంరంభంలో ఏ క్షణంలోనైనా ఏ అంటువ్యాధి అయినా వ్యాపించే ప్రమాద ముంది ఆకస్మికంగా ఎవరికైనా ఏ వ్యాధిఅయినా రావచ్చు. తన్నివారణకే తాత్కాలిక వైద్యాలయం.

అమ్మ చల్లని చూపుల్లో తడిసే ఈ ప్రదేశంలో ఏ అగ్ని ప్రమాదం జరగదని అందరికి తెలుసు, అయినా ఎవరి బాధ్యత వారిది.

అగ్నిమాపకదళంవారు సర్వసన్నద్ధులై ఉన్నారు. ఎన్ని ప్రాంతాల నుండో, ఎంత దూరంనుండో ఉరుకుల పరుగులతో వస్తున్నారు. అలసట చెందిన కారులు బారులుతీరి సేదతీరుతున్నాయి. స్టేట్ ఆర్.టి.సి. వారు రాష్ట్రంలోని అన్ని మూలలనుండి జిల్లెళ్ళమూడికి అసంఖ్యాకంగా బస్సులు నడిపి, యాత్రికులకు మహోపకారం చేసి అమ్మ సేవలో పాలుపంచుకున్నారు. క్యాంటీనులు, కొబ్బరికాయలు, పండ్లు, పూలు, అమ్మ ఫోటోలు, సాహిత్యం దొరికే విక్రయశాలలు ఏర్పాటు చేయబడ్డాయి.

అట్టలపై అమ్మ నామాలు.
అంతరంగాల్లో నమోవాకాలు

ఐంద్రి మహావిద్య అనుపేర ఏ తల్లి వేదవీధులలోన వెలయుచుండు
ఏ దేవి సతము విద్యాదేవ కులపతి గుండెలో వెలుగులుగూర్చుచుండు
పదిరెండు వర్షములు వెదకించి ఏమాత ఋషులకు
ఇచ్ఛాశక్తి ఇచ్చుచుండు
మంత్రమూర్తుల తపోమహనీయ వాక్కులందు ఏ సవిత్రి
నివాస మొసగుచుండు
ఏ జగజ్జనయిత్రి కవీంద్ర హృదయ పాలనము చేయుచుండు
ఆ పరమ శక్తి అవతరించెను మన జ దేహంబునందు
చూడరావోయి జిల్లెళ్ళమూడిలోన....

—డా॥ ప్రసాదరాయ కులపతి

లక్షమందికి ఒకేసారి వంట చేయాలంటే....
....ఎంత పాత్రి సామగ్రి కావాలి?
ఎంతమంది వంటవాళ్ళు కావాలి?

రాష్ట్రంలోని అన్ని పట్టణాలనుండి పాత్ర సామగ్రి, వంట సామాను తరలి వచ్చింది.

వందలాది వంటవాళ్ళు అన్ని జిల్లాలనుండి వచ్చి ఆ మహా యజ్ఞంలో పాల్గొన్నారు. ఆనాటి భారీఏర్పాట్లలో పాలసేకరణ ఒకటి.

పది వేల లీటర్ల పాలు. వాటిని కాచి, తోడుపెట్టి మజ్జిగ చేయాలి. సామాన్యమైన విషయమా!

ఉదయమిదే....
మాతృశ్రీ స్వర్ణోత్సవ మహోదయమిదే
మహోదయం సుధామయం
మాతృశ్రీ స్వర్ణోత్సవ మహోదయమిదే ॥ఉదయమిదే॥

ఆలయమును వదిలె అన్నపూర్ణ కదిలె
అమరప్రేమ నడులె ఆ తల్లి కనులమెదిలె
స్వపర భేదమెరుగని సహజీవనమె మెరుగని
చాటివేసె జనని పూలబాట వేసె నవని ॥ఉదయమిదే॥

ఇటు జనములు అటు జనములు ఎటు చూచిన యోజనములు
జనగణముల భోజనములు జననికి నీరాజనములు
జయప్రదం శుభప్రదం జగజ్జనని దర్శనం
జగతి ప్రగతి సుగతికి సమభావమే నిదర్శనం ॥ఉదయమిదే॥

జగజగాల యుగయుగాల నరనారీ హృదయేశ్వరి
జగదీశ్వరి యోగీశ్వరి నాగేశ్వరి భాగేశ్వరి
జననికి స్వర్ణోత్సవం జగతికి నేత్రోత్సవం
సమతా మహోత్సవం మమతా మధురోత్సవం ॥ఉదయమిదే॥

—నదీరా

తాను కోరుకున్నట్లుగా ఒకే పంక్తిన భోజనం చేసిన లక్షమంది బిడ్డలను చూసి పరవశించిన అమ్మ బిడ్డలకు దర్శనం ఇవ్వటంకోసం పూజా వేదికపైకి వచ్చింది.

అత్యద్భుతం, అపూర్వంఅయిన ఈ మహాయాగం జరిగినతీరును చూసిన ప్రజలు మాత్రం ఇది అమ్మ అనంత శక్తికి నిదర్శనమను కుంటూ ఆశ్చర్యాన్ని, ఆనందాన్ని పొందేరు. హైదరాబాదు సోదరుల పక్షాన అమ్మకు సావనీర్ సమర్పించబడింది. అమ్మ ఆ సంచికను ఆవిష్కరించింది.

ఆకంఠ పాద సుమనోమాలామగ్న సువిగ్రహ,
సంకల్ప సిద్ధ: సర్వ సమర్థ
శక్తి స్వరూపిణి; అమ్మ.

## హైదరాబాదు విమానాశ్రయం

అమ్మతో వచ్చిన నాన్నగారు అందరూ విమానం నుండి దిగుతున్నారు. అమ్మతో ప్రయాణం చేయటమంటే ఎంత సరదాగా ఉంటుందో చెప్పలేం. అందుకే అమ్మ ఎక్కడకు బయలుదేరినా వెంట ఎందరో ఉంటారు.

అమ్మ....... స్వరూప లలిత
స్వభావ మధుర
ప్రేమ రూపిణి
ప్రేమ భాషిణి
ప్రేమ వర్షిణి
ప్రేమోన్మాదిని.

హైదరాబాద్ ప్రజలపై ప్రేమసుధలు కురిపించటానికి బేగంపేట విమానాశ్రయంలో అవనీతలంపై అడుగు పెడుతోంది.

ఏడిచే బిడ్డను ఎత్తుకోటానికో........
ఆపదలో ఉన్న బిడ్డను ఆదుకోటానికో........
ఆడుకునే బిడ్డను చూసి ఆనందించటానికో........
అన్నట్లుదిగుతోంది.
దండలు వేసేవాళ్ళు - దండాలు పెటేవాళ్ళు
అమ్మను దిగనిస్తే కదా - మెట్లపైనే ఆపేశారు.

హైదరాబాద్ సికింద్రాబాద్ నగరవాసులే కాక పరిసరప్రాంతాల నుండి వేలాదిజనం తమప్రియతమ జననికి ప్రేమాంజలిని సమర్పించటం కోసం విమానాశ్రయానికే వచ్చారు. అమ్మ తన సంతానాన్ని చూసింది.

అమ్మకు కూడా మనస్సు పరవశించిందో శరీరం పులకించిందో తన దివ్యహస్తాన్ని గాలిలో ఊపుతోంది.

ఆ చెయ్యి.... సూర్య కిరణంవలె
సుందర కమలంవలె ప్రకాశిస్తోంది;
పరిమళిస్తోంది:
ఆ చేతిలో.... అమృత కలశమే ఉందో,
అయస్కాంతమే ఉందో;
అభయ ప్రదానమే ఉందో,
అనురాగ పతాకమే ఉందో,
సర్వజీవ జీవన సంజీవనే ఉందో,
సమస్త జనుల అంతరంగాల్లో సంతోషం సముద్రమై ఉప్పొంగిపోయింది.

ఒక పసిపాపను అమ్మకు అందించారు. అమ్మ హైదరాబాదు నగరాన్నే చంకనెత్తుకుంటున్నదా అనిపించింది. తనకోసం వెయ్యికళ్ళతో ఎదురు చూస్తున్న బిడ్డలకోసం అమ్మ ముందుకు నడుస్తోంది.

కింద పెడితే కంది పోయే కాళ్ళు
ఎండ తగిలితే కమిలిపోయే కళ్ళు - అయినా

ఆ కష్టాన్ని లెక్కించటం లేదు అమ్మ. ఇష్టమైతేసరి - ఏదీ కష్టంకాదు గదా! లోగడ అమ్మ ప్రయాణాలు చేసేది కాదు. అమ్మ దర్శనం వల్ల కలిగే శుభాలను గమనించిన వాళ్ళు జిల్లాల్ళుమూడి వచ్చి అమ్మను చూడలేని అభాగ్యులకు అమ్మను చూపించాలనే మహదాశయంతో అమ్మను తమ ప్రాంతాలకు తీసుకెళ్ళాలని ఎన్నోసార్లు ప్రయత్నించారు కాని - ఒక్కరి కోరికా నెరవేరలేదు. అమ్మ స్వర్ణోత్సవం కాగానే ఆ సమయం వచ్చిందేమో. వాత్సల్యయాత్ర చేయటానికి అంగీకరించింది.

## వాత్సల్య యాత్ర

లక్షమందికి ఒక్కపంక్తిన అన్నం పెట్టిన అమ్మ కోటిమందిని చూడాలనే కోరిక తెలియ చేసింది. అమ్మ ఎన్నిప్రదేశాలలో వెళ్ళింది.

ది **12-4-1974** తేదీన హైదరాబాదు ప్రజలకు అదృష్టం అమ్మ రూపం లో ప్రత్యక్షమైంది.

## హైదరాబాద్‌లో సెయింట్ థెరిస్సాస్ హాస్పటల్ :

నీలెండ్ అనే సోదరుడు నెదర్లాండ్సు నుంచి అమ్మను చూట్టానికి వచ్చాడు. అతడు ఆకస్మికంగా తీవ్రవ్యాధులకు గురైనాడు. హైదరాబాదు ఆసుపత్రిలో చేరాడు. అక్కడ చికిత్సలన్నీ విఫలమైనాయి. అతనికి అవసానకాలం సమీపించింది.

జిల్లెళ్ళమూడి నుంచి అమ్మ తీర్థం, ప్రసాదం పంపించింది. అతడు పునర్జన్మ పొందాడు నీలెండ్ బ్రతకటమనేది అతనికి వరప్రసాదం, అక్కడ డాక్టర్లకు అర్థంగాని అద్భుతం. నీలెండును చూట్టానికే అమ్మ వచ్చినా డాక్టర్లు, రోగులు అందరూకలిసి అమ్మకు స్వాగతం చెప్పారు.

తనకు ప్రాణభిక్ష పెట్టిన అమ్మను చూసిన నీలెండ్ హృదయం కృతజ్ఞతతో ప్రేమభావంతో నిండిపోయింది. అమ్మను అమాంతం కౌగిలించుకున్నాడు. ఆ దివ్యస్పర్శలో అతడి మనస్సే కరిగిపోయింది. కన్నీటితో అమ్మను తడిపివేశాడు. అమ్మ ఆప్యాయతతో అతడికి అరటిపండు వొలిచి పెట్టింది. అతనికి చికిత్సచేసిన సిస్టర్స్ కూడా అమ్మ ప్రేమను పంచుకున్నారు. వారికీ అమ్మ ప్రసాదం పెట్టింది.

అమ్మ ఆసుపత్రిని చూస్తోంది.

అమ్మ అనుగ్రహానికి పాత్రుడైన నీలెండ్ అమ్మను గురించి చెబుతున్నాడు.

## ఏలూరు :

అమ్మ ఏలూరొచ్చింది. కాలేజీ ఆవరణంలో అమ్మ సమిష్టి దర్శనం ఏర్పాటైంది. భూమి ఈనిందా అన్నట్లు లక్షలకొద్దీగా జనం అమ్మను చూట్టానికొచ్చారు. అందరి కళ్ళల్లో అమ్మను చూడాలని ఆసక్తి; అనిర్వచనీయమైన భక్తి.

జలసముద్రం అనదగిన మహాజనతకు దర్శనం ఇవ్వటంకోసం ఉన్నతమైన వేదికనలంకరిస్తోంది.

అమ్మ కోటిసూర్యులకాంతితో,
కోటి చంద్రుల చల్లదనంతో,
నడయాడే విగ్రహంవలె కనిపిస్తోంది.
ఆ లక్షమందిలో ప్రతి ఒక్కరిని చూస్తోంది;
చూపులతోనే పలకరిస్తోంది,
చూపులతోనే ఆశీర్వదిస్తోంది,
చూపులతోనే తన సంతృప్తిని సంతోషాన్ని
తెలియజేస్తోంది.

అమ్మ ఉపన్యాసాలు చేయదు,
నామసంకీర్తన వినిపించదు,
మహిమలు ప్రదర్శించదు.

అమ్మ మౌనంనుండే ఎవరికి ఏం కావాలో అది అందుతోంది.

అందరి మనస్సుల నిండా చెప్పలేని ఆనందం, వివశత్వం.

ఎవరికి వారు దైవం తమకోసమే తమ ఎదుటికే వచ్చి నుంచున్నట్లు పరవశిస్తున్నారు.

ప్రార్థనలు చేస్తున్నారు, కోరికలు విన్నవిస్తున్నారు. అమ్మ తమవంకనే చూస్తున్నట్లు తమతోనే మాట్లాడుతున్నట్లు అనుభూతిని పొందుతున్నారు.

సర్వత్రా వ్యాపించిన దైవం, దేవాలయాల్లో రాతిరూపంలో ఉన్న దైవం మన మొరలను వింటాడో వినడో, మన లాలన పాలన వహిస్తున్నాడో లేదో మనకు తెలీదు. ఎంతకీ కోతిపిల్ల కోతిని కరుచుకున్నట్లే; మన మనస్సుతో, నమ్మకంతో మనం పట్టుకోవలసిందే.

కానీ....

రక్తమాంసాలతో, కరచరణాలతో
మానవరూపంలో, మాట్లాడే దేవతగా
దైవశక్తి ఎక్కడైనా కనిపిస్తేచాలు - ఆ పాదాబ్జాలపై మన బరువు బాధ్యతలు అప్పగించవచ్చు. ఇక మనకు ఏ చింత ఉండదు.
పిల్లి పిల్లను తల్లి నోటకరచుకుని తిరుగుతూ దానిని కాపాడుకున్నట్లే -

మనం మరిచినా - తాను మరవడు.
మనం వదిలినా - తాను వదలడు.
మనం ద్వేషించినా - తాను ప్రేమిస్తాడు.
మనం దూషించినా - తాను లాలిస్తాడు.
మనం అలిగినా - తాను ఆదుకుంటాడు,
మనం పారిపోతే - తాను వెంటాడి వెన్నంటి ఉంటాడు.

అందుకనే అవతారమూర్తులంటే ప్రజలలో అంత ఆకర్షణ.

ఆరాధన..................

..................ఎప్పుడు ఎక్కడ ఏ మహాపురుషుడు అవతరించినా ఆ ప్రాంతంలో ప్రజలు వెఱ్ఱెత్తిపోయినట్లు చరిత్ర చెబుతుంది.

ఏలూరులోని సెయింట్ థెరిస్సాస్ కాలేజివారు అమ్మను ఆహ్వానించారు. కాలేజి ప్రిన్సిపాల్ ఎదురొచ్చి స్వాగతం చెప్పింది. అమ్మ చదువుకోకపోయినా, చదువుకున్న వాళ్ళనీ చదువుకోని వాళ్ళనీ తేడా లేకపోయినా విద్యాసంస్థలంటే అమ్మకు ఇష్టం.

అమ్మ విద్యాస్వరూపిణి గదా!
ఎక్కడకొచ్చినా, ఎవరిని చూసినా,
అమ్మకు తన బిడ్డే అనిపించటం సహజం.

బిడ్డలను చూడగానే ఏదో ఒకటి పెట్టుకోవాలి అనిపిస్తుంది. ప్రిన్సిపల్‌కు బిస్కట్లు పెడుతూ ప్రేమగా నోటికి అందించింది.

అవిటికుఱ్ఱవాణ్ని అమ్మ వద్దకు తీసికొచ్చారు. అమ్మ తాకితే బాగౌతాడని తల్లిదండ్రుల ఆశ. రాముడి స్పర్శవల్ల రాయి అహల్యా రూపంధరించింది. కృష్ణుడు తాకితే కురూపి కుబ్జ అసమానసౌందర్యవతి అయింది.

మహనీయుల కరుణకలిగితే కుంటివాడు పర్వతాలు దాటవచ్చు; మూగవాడు అనర్గళంగా మాట్లాడవచ్చు. వారికి కరుణ ఎట్లా కలుగుతుందో,

ఎప్పుడు కలుగు తుందో,
ఎవరికీ అర్థం కాదు.

## జీవితమే పెద్ద పుస్తకం :

అమ్మ గ్రంథాలయం పరిశీలిస్తోంది. చిన్నతనంలో ప్రాథమిక పాఠశాల కూడ వెళ్ళలేదు. అమ్మకు లోకమే పాఠశాల; జీవితమే పెద్ద పుస్తకం;

ప్రతి అనుభవం ఒక పాఠమే,
అమ్మ అంది, "అనుభవం శాస్త్రాన్నిస్తుందిగానీ
శాస్త్రం అనుభవాన్నివ్వదు"-అని
ప్రిన్సిపల్‌కు అమ్మ తన మెడలోని స్ప్రింగ్‌ను బహూకరిస్తోంది.

## సర్వమంగళ- అమ్మ :

ఒకసారి ఒక అమ్మాయిపెళ్ళి అమ్మ చెంత జరుగుతోంది. తన మెడలోని నల్లపూసలగొలుసు తీసి ఆ పెండ్లికూతురి మెడలో అలంకరించింది. దానిని త్యాగ మందామా? వాత్సల్యము అందామా?

## సర్వజ్ఞ- అమ్మ :

కాలేజీలోని భాగాలన్నీ చూస్తోంది అమ్మకిది తెలుసనీ లేదు-ఇది తెలీదనీ లేదు

అమ్మే అంది, "నాది తెలిసీ తెలియని స్థితి" అని.
. దేనిని చూసినా ఏమీ తెలీనట్లే చూస్తుంది.
ఏం మాట్లాడాల్సి వచ్చినా అన్నీ తెలిసే వుంటయ్.

'నాకేమీ తెలీదు, నేనూ మీలాంటి దాననే' అనటం మాత్రం అమ్మకు అలవాటు.

## మాతృశ్రీ నిలయం - మాధవీ నిలయం :

ఆడపిల్లలందరు ఒకరి వెంట ఒకరు అమ్మ శ్రీ చరణాలకు నమస్కారం చేసుకుంటున్నారు.

అమ్మ ఎక్కడ ఉంటే అదే దేవాలయం.
అమ్మ కూర్చున్నదా, నుంచున్నదా అని లేదు;

బడిలో వుందా, గుడిలో వుందా, అన్న ఆలోచనే లేదు.

బామ్మగారు చనిపోయినపుడు అమ్మ స్మశానానికి వెళ్ళింది. కొందరక్కడే అమ్మకు పూజ చేసుకున్నారు. అమ్మ వద్దనలేదు. తర్వాత నూతన వధూవరులు అక్కడకే వచ్చి అమ్మకు నమస్కారం చేసుకున్నారు.

అమ్మ ఆశీర్వదించింది.

## సర్వ సమాన దృష్టి :

సంభవామి యుగేయుగే అన్నాడు భగవంతుడు. లోకంలో అధర్మం పెచ్చుపెరిగినప్పుడు లేక ఏ ఒక్కడో ప్రజాకంటకుడై ప్రబలి పోయినప్పుడు సర్వేశ్వరుడు అవతరిస్తాడు - దుష్టుల్ని సంహారిస్తాడు - శిష్టుల్ని రక్షిస్తాడు - అది ఆయన ధర్మమట.

ధర్మ సంస్థాపనకోసం ఇంతవరకూ అన్ని అవతారాల్లోనూ భగవంతుడు మగవాడుగానే వచ్చాడు. ఇదే మొట్టమొదటిసారి పరమేశ్వరుడు స్త్రీ రూపం ధరించడం, అందుకే అన్ని అవతారాలకు యీ అవతారానికి ఎంతో మార్పు కనిపిస్తుంది. ఆ అవతారాలదృష్టిలో దుర్మార్గులని, సన్మార్గులని, విభజన ఉంది. ఒక వర్గం వారికి దండన, మరోవర్గంవారికి స్వర్గసుఖాలు.

ఆ మనస్తత్వంలో భిన్నత్వముంది.

ఆ విధానంలో ఆశ్రిత పక్షపాతముంది.

అమ్మ అవతారం వాటికంటే విభిన్నమై, విలక్షణమై, విశిష్టమై విరాజిల్లుతోంది.

అమ్మ దృష్టిలో పాపులు, పుణ్యులు అని వేరే లేరు. అమ్మ నిఘంటువులో తప్పు అనే పదమే లేదు.

తల్లికి తప్పే కనిపించదు "అని వక్కాణించింది. మంచి చెడ్డలు తూచటానికి త్రాసు తెచ్చుకోలేదట. కనుకనే అమ్మ బేషరతుగా చెప్పింది, "అందరికీ సుగతే" నని.

ఆశ్రయించిన వారని, ఆశ్రయించని వారని
తేడా లేదు, భిన్నత్వం లేని మనస్తత్వం;

విచక్షణ లేని వీక్షణ;
సర్వ సమాన దృష్టి-

ఈ అధునాతన సిద్ధాంతాన్నే ఆధ్యాత్మికచింతనలో సామ్యవాద మని తార్కికులు పేర్కొంటున్నారు. ఈ అవతారంలో ఎక్కడా కాఠిన్యం కనుపించదు;

శాసనం వినిపించదు;
అంతా లాలిత్యమే;
అందరిపై వాత్సల్యమే:
అందరిపై కారుణ్యమే;

శరీరం చూస్తే మందారం కన్నా మార్దవం;

మనస్సు వెన్నకన్న మెత్తన, వెన్నెలకన్న చల్లన.

ఆడపిల్లలందరుకలసి అమ్మ కారును చుట్టేశారు. దేవుడంటే అందరికీ ఇష్టమే. కానీ అమ్మ అంటే ఆడపిల్లలకు మరింత ప్రియం; చనువు చివరకు అమ్మ కూర్చున్న కారునైనా తాకాలని వాళ్ళ అనురక్తి - ఆరాటం. విశ్వసమ్మోహనమూర్తి మురళీధరుడు - అమ్మ.
ప్రతి బాలిక - ఒక గోపిక,

పాట : జిల్లెళ్ళమూడిలో స్త్రీరూప ధారిణియై
దిగివచ్చి నిలిచినది దివ్య మాతృ ప్రేమ ॥జిల్లెళ్ళ
ఆ ప్రేమధారలో ఆత్మార్పణము చేసి,
తనియించెదరు దేహధారులీ వసుధలో ॥జిల్లెళ్ళ
కనుదోయి వర్షించు, కరుణామృతము గ్రోలి
తమ్మి తామరతురు, తన్మన్నిధావమున ॥జిల్లెళ్ళ॥
తన బిడ్డలట లోకమున కల్గు జనులెల్ల
తన ప్రేమ దుగ్ధముల తనియించి బ్రోచురట ॥జిల్లెళ్ళ॥
ఎవ్వరో ఈ అమ్మ ఎందుకో ఈ రాక
ఏ తీరములనుండి ఏమి కొని తెచ్చెనో
అమ్మ అమ్మలకమ్మ మేలిబంగరు బొమ్మ
అమ్మ పదములకివే ప్రేమ ప్రసూనాలు ॥జిల్లెళ్ళ॥

## నర్సాపురం :

నేలపై కొత్త గుడ్డలు పరిచి పూలుచల్లుతూ

సకల లాంఛనాలతో అమ్మకు స్వాగతం చెప్పారు.

అమ్మ వంగ చెట్టుకు నీళ్ళు పోస్తోంది; కాయలు కోస్తోంది. అంటే స్థితి సంహారానికి తానే కర్తనని చెపుతోందా; మరి సృష్టికి అదీ కనిపించదు.

మైనాతో అమ్మ:
అలిగిన బిడ్డను బ్రతిమాలుతున్నట్లుంది.

## అనంత వాత్సల్య మూర్తి - అమ్మ :

అమ్మకు కుంటివాళ్ళన్నా, చెవిటివాళ్ళన్నా, గుడ్డివాళ్ళన్నా, కుష్టురోగులన్నా ప్రత్యేక ప్రేమ. సంఘం విసిరేసిన వాళ్ళను ఆదరంతో తన వడిలోకి తీసుకుంటుంది.

అమ్మకు పువ్వులంటే ఎంత ఇష్టమో!
అమ్మ నవ్వులో పువ్వుల పరిమళం ఉంటుంది.
కాని ఒక సహస్రదళ దివ్యారాధనగా—

పర్యటనలో పూజలందుకున్నా సన్మానాలందుకున్నా అమ్మ బయటకు బయలు దేరటానికి అసలు కారణం సమాజంలో ఉపేక్షితులై, సంఘానికి దూరులై, నికృష్టమై, అసహ్యమైన బ్రతుకులు గడుపుతూ దైవోపహతులనబడే పేదవాళ్ళపై అమ్మకు గల సానుభూతి,ఆదరం, అనురాగం మాత్రమే.

అందుకనే అమ్మ ఎక్కడకు వెళ్ళినా

వాళ్ళ గుణాలను, తేడాలను పరిశీలించ లేదు;
వాళ్ళ నైతిక స్థాయిని పరీక్షించ లేదు;
వాళ్ళ మంచి - చెడులను సమీక్షించ లేదు;
వాళ్ళు ఎట్లాతింటున్నది, ఏమితింటున్నది మాత్రమే విచారిస్తుంది.

అమ్మ అంటుంది, "మంచి వాళ్ళను వాళ్ళ మంచితనమే కాపాడుతుంది; వాళ్ళను సంఘం ఎలాగూ గౌరవిస్తుంది; ప్రేమిస్తుంది. చెడ్డ వాళ్ళను నేనుకూడా దగ్గరకు తియ్యకపోతే ఎలా? వాళ్ళకు నావడిలో ఎప్పుడూ స్థానం ఉంది" అని.

"పిల్లలు బురద పూసుకుంటే బాగుచెయ్యాల్సిన బాధ్యత తల్లి దట".
"తల్లి అంటే తరింప చేసే" దట.

నర్సాపురంలో వీధుల వెంట తిరుగుతూ ఎక్కడెక్కడ అభాగ్యులున్నది వెదికి వాళ్ళకు ప్రసాదం,గుడ్డలు పంచిపెట్టింది. కుష్టువాళ్ళు కనబడితే కారాపి వాళ్ళను దగ్గరకు పిలిచి ఆదరించింది: అనంత వాత్సల్య మూర్తి;

అనాథ జనతా భాష్పరుధిరాకుల విలోచన.

గోదావరిలో అమ్మ తన పిల్లలతో ప్రయాణం చేస్తోంది. అందర్ని పవిత్రం చేసే గోదావరి అమ్మ దర్శనంతో తాను మరింత పవిత్రమైనట్లు పరవశించి పులకించిపోతున్నది.

తన కెరటాల చేతులు చాచి అమ్మ పావన పాదాలను తాకాలని ఉవ్విళ్ళూరుతోంది. అమ్మ ఎక్కడకు వెడుతున్నదో.

పాట : ఎంత దూరమమ్మా యీ పయనం
దృష్టి సారు దూరమా
సృష్టి సాగు దూరమా ॥ఎంత
మన్నులోన మిన్నులోన
సన్న లేని కన్నులోన
కానుపించు దృశ్య మవలి
తీరమంత దూరమా ॥ఎంత
సకల చరా చర జీవుల
సృష్టి స్థితుల సర్వ సాక్షి
కాలగర్భ మెరుగలేని
కాలమంత దూరమా
జగతి నేలు జనని గుండె
లోతులంత దూరమా ॥ఎంత

— మన్నవ బుచ్చిరాజు శర్మ.

## భీమవరం:

భీమవరం కాలేజీ ప్రాంగణంలో అమ్మ దర్శనం. దాదాపు లక్ష జనం. వారిలో అన్ని మన స్తత్వాల వాళ్ళు ఉన్నారు.

వేద విహితులను, హేతువాదులను,
పారమార్థికులను, పదార్థ వాదులను,

ఆ_స్తికులను, నా_స్తికులను.... అందరిని అమ్మ తన ఒడిలోకి తీసుకుంటోంది.

నా_స్తికులది కూడ ముక్తి మార్గమేనని చెప్పినవాళ్ళు యింత వరకూ ఎవ్వరూ లేరేమో!

"దారులు మార్చు కాని, ఆ_స్తికులకు నా_స్తికులకు గమ్యం ఒక్కటే" నని అమ్మ మాత్రమే చెప్పింది.

జన్మలు లేవని,
జగత్తు సత్యమని,
శరీరమూ ఆత్మ కాకపోలేదని,
స్వభావమే దైవమని.... లోగడ ఎవరు చెప్పారు.

అమ్మ వినూత్నమైన సత్యాలను ప్రవచిస్తోంది. అదువల్లనే అమ్మ నా_స్తికులకూ-డా పరమాప్తురాలైంది.

## పాలకొల్లు :

పాలకొల్లులో సామూహిక దర్శనం ఏర్పాటు చేసిన సభాస్థలికి అమ్మను ఊరేగింపుగా తీసుకెళ్లుతున్నారు. పూజలోగాని, ధ్యానంలో గాని, ఊరేగింపులోగాని, ఉత్సవంలోగాని - ఎవరి ఇష్టదైవాన్ని వారు అమ్మలో చూస్తారు.

అమ్మ మాత్రం - "నేను అమ్మను. మీరు బిడ్డలు" అంటుంది. "మీరు బిడ్డలే కాదు, నా అవయవాలుకూడా" అని వివరిస్తుంది "మీరు కానిది నేనేమీ కాదని" విపులీకరిస్తుంది.

అమ్మ మనలో దైవత్వం చూస్తుంది. ఒక ప్రసంగంలో

"మీరంతా నేనే,
మీదంతా నేనే,
ఇదంతా నేనే-" అని చెప్పింది.

మరొక సంభాషణలో- "ఈ సృష్టి అనాది - నాది" అంది చిరునవ్వులు చిందిస్తూ. "ఈ సృష్టి అనాది" అన్న వాక్యం తాత్విక చింతనలోనే

విప్లవాగ్ని రగిలించింది. "ఈ సృష్టి నాది" అనటంలో అమ్మ సర్వ త్రానురాగం తెలుస్తోంది.

ఇంతవరకు "నా యిల్లు, నా ఊరు, నా రాష్ట్రం, నా దేశం, నా కులం, నా మతం-" అన్నవాళ్లున్నారు. కానీ "ఈ సృష్టి నాది" అన్నవాళ్లు జగత్ చరిత్రలోనే కనిపించరు.

అమ్మ తనను గురించి తానే తెలియజేస్తూ "నేను నేనైన నేను" అంది. అది అర్థంకానివాళ్ళకు "అన్ని నేనులూ నేనే" అని వ్యాఖ్యా నించింది. యీ అనంత సృష్టిలో తాను కానిదేమీ లేదట.

అన్నీ తానైన ఈ స్థితి-
యోగానికి పరాకాష్ఠ,
జ్ఞానానికి పరమావధి.

...... శాస్త్రాలలో వివరింపబడిన అనేక సూత్రాలకు అమ్మ సజీవ నిదర్శనం

........ అందుకే ఆ మూర్తిని చూడాలని జనంలో అంత తపన: తహ తహ.

........ ఎంత చూసినా యింకా చూడాలని అభిలాష.

........ ఎన్నిసార్లు చూసినా, ఇంకోసారి చూడాలని ఆసక్తి.

## విశ్వ కుటుంబిని అమ్మ :

పాలకొల్లులో అమ్మ జ్యోతిని వెలిగించటం ద్వారా బాలమందిరానికి ప్రారంభోత్సవం జరుపుతోంది. పాలకొల్లు హరిజన వాడలో అమ్మ... జిల్లెళ్ళమూడి వచ్చి అమ్మను చూడలేనివారి కోసమేగా అమ్మ పర్యటన.

........ ఈ పర్యటనలో అవిటివాళ్ళని, ఆసుపత్రుల్లో ఉన్న వాళ్ళని, జైళ్ళలో ఉన్న వాళ్ళని ఎంతమందినో చూసింది.

....లోకంలో తల్లిని వెదుక్కుంటూ వెళ్లే బిడ్డ లెందరైనా ఉండొచ్చు. కానీ, బిడ్డలను వెతుక్కుంటూ వెళ్లే తల్లి యీ అమ్మ ఒక్కతే మాత్రమే కనిపిస్తుంది.

....... తనను గురించి తెలియనివాళ్ళ దగ్గరకు కూడా వెళ్ళి "నేను మీ అమ్మను నాన్నా" అంటూ తన ప్రేమ ప్రసాదాన్ని పంచిపెడుతోంది.

విశ్వ జనని, విశ్వ కుటుంబిని,
విశ్వేశ్వరి, విశ్వ రూపిణి,........అమ్మ.

చరిత్రకు అందని అమ్మ :

జ్ఞాన సీమ కోనసీమలోని రాజ్యోలు,
జ్ఞానమే తానైన అమ్మకు చెప్పులొంది జేజేలు.

చరిత్రలో ........ ........

.... .... .... .... జ్ఞానులున్నారు; విజ్ఞానులున్నారు;
యోగులున్నారు, విరాగులున్నారు; వ క్తలున్నారు, ప్రవక్తలున్నారు
సిద్ధులున్నారు, ప్రసిద్ధులున్నారు తాత్వికులున్నారు, తపోధనులున్నారు
కానీ వారందరూ వారి పరిధుల్లో సాధన చేసారు;
లక్ష్యాన్ని సాధించారు; సార్థక జీవనులైనారు.
కానీ అమ్మ విధానమే వేరు:

.... తాను శిఖరాగ్రం అధిరోహించి కూడ మనకోసం ఎవరు నేలపై నడిచారు?

.... తన ఆకలిని మరచి, మన ఆకలి గురించి, అన్నం గురించి యింతగా ఎవరాలోచించారు?

.... సృష్టి సంతను పసిపాపగా భావించి ఎవరు ప్రేమను కుమ్మరించారు?

.... "నీవు ఏం చేసినా – నీ బాధ్యత ఏం లేదు.
భగవంతు డేం చేయిస్తే అదే నువ్వు చేశావు.
నువ్వు చేసిన పాపానికి శిక్ష ఏదైనా ఉంటే అది
భగవంతుడికి మాత్రమే" అని ఎవ్వరు మనను ఓదార్చారు?

.... "తోచిందేదో చెయ్యి– తోపింపజేసేది దైవమేగా.
నువ్వు నడిచేదే నీ దారి. ఏ దారిని నడిచినా గమ్యం
చేరతావు"– అని మన భుజం తట్టి ఎవరు ధైర్యమిచ్చారు?

.... మన యోగక్షేమాల బాధ్యత వహిస్తామన్నవాళ్ళున్నారు గానీ,
మనం తింటే తాము తిన్నట్లయి, మనకు పెట్టుకోక పోతే చిక్కి-
పోయే వాళ్ళెవరున్నారు?

.... .... అందుకే ప్రజలకు అమ్మంటే అంత ప్రేమ
అందరి హృదయాల్లోనూ అమ్మ దివ్య రూపమే.
అందరి నాలుకలపై అమ్మ అమృత నామమే.

... కనిపించే దైవం :

ఇవ్వాళ నా జీవితంలో మరపురాని మరువలేని రోజు. అమ్మను గురించి ఎంతమందో చెప్పారు; అమ్మను చూడాలని ఎన్నిసార్లో అనుకున్నాను; నేటికిగాని అమ్మ దయ నాపై ప్రసరించలేదు.

పరమేశ్వరుడ్ని కళ్ళారా చూశాను.

పురాణాలూ, పుస్తకాలూ చదివేటప్పుడు ఆయా అవతారాల కాలంలో నేను లేకపోతినే అని విచారించేవాణ్ని.

రాముడి కాలంలో ఒక వానరమైనా కాకూడదా!

కృష్ణుడి కాలంలో ఒక గోపికనై ఉండకూడదా?

రామకృష్ణ పరమహంస కాలంలో నేను లేను కదా!

అయ్యో! రమణ మహర్షిని దర్శించనే లేదే! – అని విచారించే వాడిని.

ఇవ్వాళ ఆ విచారమంతా మాయమైంది. అమ్మతో పాటు జీవిస్తున్నాం: అమ్మను చూడగలుగుతున్నాం; అమ్మ మాటలు వినగలుగుతున్నాం; మనమంతా ఎంతో ధన్యులం అంటున్నారా సోదరులు

పాట: అన్నదాతా సుఖీభవ- అనసూయ మాతా సుఖీభవ
జన్మదాతా జయీభవ- విజ్ఞాన ప్రదాతా విజయీభవ ।అన్న
ఎందరు రానీ ఎప్పుడు గానీ
ముందుగ విందులు చేయును జననీ
ఇది ఒక యాగం – ఇది ఒక యోగం
ప్రజోపయోగం – ప్రేమ ప్రయోగం ।అన్నదాతా
కడుపారా తను కన్నది జనని
కడుపు నిండ తినమన్నది మనని
మహా ప్రసాదం మహా ప్రమోదం
మహదానందం మమతా బంధం ।అన్నదాతా
భోజనకాలే నామ స్మరణం
పూజనీయ మనసూయా చరణం
జయహో మాతా శ్రీ అనసూయా
రాజ రాజేశ్వరి శ్రీ పరాత్పరి ।అన్నదాతా

—(౦)—

## అమ్మ సందేశం

తమ బ్రతుకును తాము బ్రతకలేని అనేక విధాల బలహీనులు ఉన్నారు. వారికి తోడుపడండి. అయితే అది వారిపై జాలితో చేసే సహాయమని అనుకోక వారిని భగవత్ స్వరూపులుగా భావించి సేవ చేయండి.

కనుపించని దేవునిపై మనస్సు నిలవడంలేదనీ, ఏకాగ్రత కుదరడంలేదనీ బాధపడక మానవ రూపంలో కనిపించే ఈ దేవుళ్ళను ప్రేమతో ఆరాధించండి.

ఆ సేవలో కలిగే తృప్తే ముక్తి.

బాధితుల-ఎడ కలిగే కరుణా రసభరిత హృదయస్పందనమే దైవత్వం.

ఎదుటివానిలో మంచిని చూస్తున్నంతసేపూ నీలో దైవత్వం కలుగుతుంది.

... మంచిని మించిన మహిమలు లేవు.

శుక్లశోణితాలకు ఏదికులమో అదే నాకులమనీ, సర్వసమ్మతమే నామతమనీ, చెబుతూ, గుణభేదమేలేని నాకు, కులభేదమేమిటని ప్రశ్నించిన, విశ్వజనని.

మాతృశ్రీ
పబ్లికేషన్స్ ట్రస్ట్
సమర్పించు



# అమ్మ

కూర్పు, దర్శకత్వం (వర్ణ చిత్రం)
**M.S.N. మూర్తి.**

ఛాయాగ్రహణం
కె. కె. చంద్రమోహన్
సంగీతం.
సుసర్ల దక్షిణామూర్తి
పామర్తి

విజయా
రిలీజ్



Printed at : Sri Venkata Ramana Mudranalayamu,
Paddy Market, Narsapur.